# హాస్కు

Hasku

రచయిత్రి

కె. లక్ష్మీరఘురామ్

K. Lakshmi Raghu Ram.

ప్రాప్తిస్థానం

ఆంధ్ర మహిళా ప్రెస్ మద్రాసు 4.

తొలికూర్పు :
1000 ప్రతులు.
ముద్రణ :
ఆంధ్ర మహిళా ప్రెస్.

వెల రు 1-50



దొరుకు స్థలము :
ఆంధ్ర మహిళా ప్రెస్
7. ఏ రోజరీచర్చిరోడ్డు
మద్రాసు 4.

# అంకితము

శ్రీ కొత్త రఘురామయ్యగారికి



ధర్మార్థ కామ మోక్షముల భాగస్వామికి
నా అనుభవ సంపదలో భాగము.

# ఒక్క మాట

పాఠక మహాశయులారా

ఇది నే వ్రాసిన వ్యాస సంకలన గ్రంథములలో మూడవది. ఇదివరలో మొగలిపొట్లము, మనలో మన మాట సమర్పించుకుంటి. "శరీర మాద్యం ఖలుధర్మ సాధనము" అని నమ్మి నేను సంఘమునకు నా రచనలు ద్వారా నాఋణ మును దీర్చుకొనదలచితిని. ఆకార్యమునకు ఆంధ్రమహిళా సభ స్థాపకులు నాకు ఆంధ్రమహిళను వప్పగించగా నేను నా చేతనైనంతవరకు ఈ మాసపత్రిక ద్వారా మహిళోద్య మము సాగించుచుంటిని. ఈ రచనా పుష్పములను గ్రుచ్చి ఇదివరకు మహిళోద్యమమునకు రెండు హారములు వైచితిని. అవి ఆ వుద్యమమునకుగాని, కవితామాతకుగాని ఎంతవరకు శోభను గూర్చినవో నే జెప్పలేను. కాని ఈ హారముల సౌర భమును ఆఘ్రాణించి అస్వాదించి పులకితులైనవారు, ఆనందిం చినవారి ప్రోద్బల ఉత్సాహములతో ఈ మూడవ హార మును కూడ కూర్చితిని.

అదృష్టవశాత్తో, దురదృష్టవశాత్తో నాకు లభించిన విద్యా సంస్కార వివిధ జీవితాల సమస్యల అనుభవముతో ఈ కార్య ప్రయత్నము ఆరంభించితిని. కించిజ్ఞురాలునైన నా యీ రచనలలోని సందేశ సారాంశమును మాత్రమే గ్రహించి నా తప్పులను ఒప్పులుగా గ్రహించి, నా జీవిత ధర్మకార్య నిర్వహణయందు ప్రోత్సాహించి మహిళోద్య మమునకు తోడ్పడగలరని ఆశించుచున్నాను.

14 అశోక రోడ్డు,
క్రొత్తఢిల్లీ
శివరాత్రి, విళంబి

రచయిత్రి
కె. లక్ష్మీరఘురామ్

# తొలి పలుకు

"నేను నాజీవితములో సాధించ గలిగింది యీ కలముతోనే సాధించ దలచాను. ఈ కలము అసత్యము వ్రాయదు. నాకింక భయమేమున్నది? ఎవరో కష్టపడతారని మానుకుంటానా? నే వ్రాసిన వాటిలో అధర్మము గాని అసత్యము గాని, అశ్లీలము గాని లేదు కదా! ఏమంటావు?" అన్న ధీమాతో- ఆసక్తితో - శ్రీమతి లక్ష్మీ రఘురామ్ వ్రాసిన యీ వ్యాస సంపుటిని చదువుతూవుంటే ఆంధ్ర దేశం మన మనోనేత్రాల ముందు చలన చిత్రంలా సాగిపోతూ వుంటుంది.- మానవ జీవితం మంచు తెరలా ద్యోతకమవుతుంది.

ఈ గ్రంథానికి యీావిడ "హాస్కు" అను పేరు పెట్టింది. హాస్కు అనే యింగ్లీషు పదానికి తేట తెనుగులో "ఊక" అంటారు. తాడూ బొంగరం లేకుండా మాటాడే పద్ధతినీ- రవ్వంత స్వాతిశయంగా చెప్పుకొనే విషయాన్నీ- ఇంగ్లీషు తెలిసినవారు "హాస్కు" అంటూ కొట్టిపార వేస్తారు. ఊకకు ఎంత విలువ యిస్తారో యీ ధోరణిలో మాట్లాడే మాటలకు కూడా అంత విలువ యిస్తారు. ఇది పరిపాటి అయిపోయింది.

అయితే యిది నిజమా? ఊకకు విలువలేదా? ప్రాచిక పుల్లకు కూడా విలువ వుందని పంచ తంత్రకారుడు చెప్పాడే? అలాంటప్పుడు ఊకకు కూడా విలువ వుంటుంది. దానిని మన వారు పూర్తిగా గ్రహించలేని మాట వాస్తవం. ఊక అనేక విధాలుగా నేడు ఉపయోగపడుతూ —ఆధునిక జీవితంలో

మనకు కొన్ని గుణపాఠాలు నేర్పుతున్న సత్యాన్ని నిరూపించడానికే గాబోలు శ్రీమతి రఘురామ్ తన గ్రంథానికి "హాస్య" అని పేరుపెట్టి వుండవచ్చును.

పద్య రచనకు పరవళ్ళు త్రొక్కే హృదయానందం కారణ మంటారు. విశ్వశ్రేయస్సు కోసరం కావ్యం బయలు దేరిందంటారు. మరి వచన రచనమూ, వ్యాసమూ ఎందుకు బయలు దేరినట్లు? ఇవీ తత్తుల్యములే. విద్యా గ్రంథమూ-భాషావైదుష్యమూలేని– అశేష సాధారణ జనులను బుజ్జగించ డానికి పనికివచ్చే సాధన సంపత్తి వచన రచన. అనుభూతిలోని అమృతాన్ని పంచిపెట్టే పరికరం వ్యాసం. ఛందోబద్ధమైనదే కావ్య మంటారు పండితులు. సరళభాషలో– చిన్న చిన్న పదాలతో సన్నకారు ప్రజలను కార్యోన్ముఖులను చేసే వ్యాసం కూడా కావ్యమంటాను నేను, రస్కిన్ మహాశయుని వ్యాసాలు ప్రపంచ ప్రబోధితములు కావా? గాంధీ మహాత్ముని రచనలు మానవ కల్యాణ కారకములు కావా? కావ్యంలోని పద్యాలు కంఠస్థమై సభావేదిక మీద—పండిత ప్రకాండుల సభలలో ప్రశంసార్హముగా పఠించడానికి ఎక్కువగా పనికివస్తవి. కానీ వ్యాసంలోని భావాలు చదువరుల హృదయాల్లో మూల మూలలకు వ్యాపించి నూతనోత్తేజాన్ని కలిగిస్తవి. కావ్యం ఆనందదాయకం, వ్యాసం ఆచరణ దాయకం అంటే పొరపాటు గాదేమో! లేకుంటే ఆంధ్రాభ్యుదయపితామహుడు శ్రీ వీరేశలింగంపంతులుగారు కావ్యాలు-నాటకాలు- ప్రహసనాలు వ్రాసిన తదుపరి వ్యాసాలు వ్రాయ

డానికి కారణమేమిటి? వ్యాస రూపేణా తన భావాలను ప్రజానీకానికి అందజేయాలనే కదా!

ఈ "హాస్కా"లో ముప్పది వ్యాసాలువున్నవి. ఇవన్నీ ఒకేసారి తాపీగా కూర్చొని తీరికగా వ్రాసినవి కావు. చాలా వరకూ యీ వ్యాసాలు "ఆంధ్ర మహిళ" కొరకు వ్రాసినవే. అవసరం కొద్దీ- ఆలోచనలు పుట్టుక వచ్చినప్పుడు- ఏదో సంఘటన జరిగినప్పుడు— యీ వ్యాసాల రూపకంగా శ్రీమతి లక్ష్మీరఘురామ్ తన కలాన్ని కదిలించింది. కొన్నిసార్లు నెమ్మదిగా నడచి- మరి కొన్నిసార్లు దుందుడుకుతో ముందుకు పర్వులెత్తింది కలం. పదాల కోసరం ఆగడంగాని— పరిభాష కోసరం పరిశ్రమ చేయడంకాని యీ కలానికి అలవాటున్నట్లు కనుపించదు. స్పందించిన భావాన్ని- అందుబాటులోనున్న పదానికి మేళవించి— వాక్య స్రవంతిలా ప్రవహించి- ఆ బాలగోపాలాన్ని చేరుకోవాలన్నంత వేగంగా పరుగెత్తిందీ కలం కొన్నిచోట్ల, పలుపోకడల నడచెడంగులు చూపిందీకలం మరికొన్ని చోట్ల.

ఈ వ్యాసాలన్నిటిలోనే కాదు- చివరకు ప్రతి వాక్యంలోనూ శ్రీమతి రఘురామ్ తన మనోగత భావాలను గొంతెత్తి చాటింది. "నైతిక పతాకాన్ని భారత మహిళలు ఎగురవేయాలి." అని ఆదేశించినప్పుడు- విదేశీయులకు కుంకుమ బొట్టు పెట్టడం మంచిది కాదని సలహా యిచ్చినప్పుడు— ఎంకీ కాంతారావుల ప్రేమ కలాపాలను ప్రస్తావించినప్పుడు—"మూఢ నమ్మకాలు కూడా ఒకప్పుడు మోక్ష సాధనాలు కావచ్చును," అని వ్యంగ్యప్రహారణ చేసినప్పుడు—

"ఒకప్పుడు దయ్యమే నన్ను చూచి పరిగెత్తిపోయింది." అని గాంభీర్యాన్ని ప్రదర్శించినప్పుడు- "ప్రజలకు తిండి పుష్కలంగా కలిగించడం ఏ ప్రభుత్వానికైనా కర్తవ్యము." అని రాజకీయాల్లోని నగ్న సిద్ధాంతాన్ని ప్రబోధించిప్పుడు- "జనాభా యింతగా పెరగకుండా వుండటం ముఖ్యం" అని రాబోవు క్లిష్ట పరిస్థితిని చూపుడు వ్రేలితో చూపినప్పుడు- ఆమె మన కళ్ళెదుట నిల్చి మనలను స్త్రీ సహజమగు ఆదరాభిమానములతో మనలను కార్యాసక్తులను చేస్తున్నట్లు కనిపిస్తోంది.

"కళ కేవలం సౌందర్యం కోసరమే కాదు. అది కావ్య సంబోధకంగా వుండాలి." అని ఒకాయన చెప్పారు. శ్రీమతి రఘురామ్ "హాస్య"లో ప్రదర్శించిన వ్యాస కళ యిందుకు అనుగుణ్యంగా వుందని చెప్పడానికి సందేహం లేదు.

బి. ఎస్. మూర్తి
డిప్యూటి మిన్‌స్టర్ ఫార్ కమ్యూనిటి
డెవలప్‌మెంట్ కోఆపరేషన్.

కర్జన్ లేన్
న్యూఢిల్లీ

# విషయసూచిక

యుద్ధభూమిలో విజయుని శంఖారావముకాదు. కురుక్షేత్రములో వీరుల శంఖావినోదముకాదు. చెవిటివాని చెవిలో శంఖారావముకాదు. ఇది మా శంఖారావము. ఇది స్త్రీల శంఖారావము. ఇది మహిళాభ్యుదయ శ్రేయోభిలాషుల శంఖారావము. ఇది దేశాభ్యుదయ హితుల శంఖారావము.

ఏ మాత్రము ఆలోచనాశక్తి, విచక్షణా జ్ఞానము, సంస్కారమున్న వ్యక్తికైనా తెలుసు ఈ సత్యము - భారత సంస్కృతీ సంరక్షకురాలు భారతనారని. ప్రపంచమంతా ఈనాడు భారత దేశాన్ని గౌరవిస్తున్నది ఎందుచేత? ఆమె నాయకులను చూచి కాదు. ఆమె సిరి సంపదలను చూచికాదు. ఆమె అందచందములను చూచికాదు. ఆమె విద్యా వైభవములను చూచికాదు. ఆమె వేదాంత కళానైపుణ్యములను చూచికాదు. కాని భారత మహిళల సతీత్వము ప్రపంచాన్నంతా ఆకర్షిస్తోంది. ఆ పూజ్యులైన భారత స్త్రీలకే ప్రపంచము జోహారు చేయుచున్నది. ఆ ప్రాచీన సాంస్కృతీ సంరక్షకులకే ప్రపంచము అంజలి ఘటించుచున్నది. ఆ శీలసంపన్నులకే సమస్త మానవాళి పుష్పాంజలి ఘటించుచున్నది.

ప్రపంచమంతా మానవత్వము ఒకటే. మరి సతీత్వము మాత్రము కాదా? సంశయమునకు అవకాశము లేకపోలేదు. భారత మహిళ ఆ సంశయమును తన నిత్య జీవిత విధానముతో పటాపంచలు చేయుచున్నది. ఆమె స్వార్థరహిత నియమబద్ధ జీవితమే

ఆ సంశయమునకు అవకాశము లేకుండ చేయుచున్నది. ఆమె శీల సంపదే ఆమెను అగ్రస్థానమున అధిష్టింప చేయుచున్నది. శాంతము, సౌమ్యము, ఓర్పే ఆమెను పూజ్యురాలుగా చేయుచున్నవి. ఆమెను బోలిన స్త్రీ ప్రపంచములో మరెచ్చట నున్నది ?

లేదు లేదు. ముల్లోకములలేదు. స్వర్గమునలేదు. నరకమునలేదు. ఈ భారత భూమిలోనే పుట్టిరి. పుట్టుచున్నారు. పుట్టనున్నారు. స్వామి వివేకానంద గాలమువేసి వెతికినా ఆయనకు అట్టి పూజ్యురాలు భారత దేశములో తప్ప వేరే కనబడలేదు. ఆయన గురువు రామకృష్ణ పరమహంసకూ కనబడకనే తన భార్య శారదామణినే షోడశీపూజ చేసి భారతసతిని గౌరవించాడు. పండిత నెహ్రూ పదేపదే భారత మహిళల ఓర్పు, సౌమ్యత, దీక్ష, స్వార్థ రహిత సేవను ప్రశంసించుచున్నాడు. ఔరా ! భారతనారి పవిత్రత, ఆమె గుణ విశేషంబులు మాకు చెల్లదు. ఆమె యందుగల విశేషము లెవ్వి ? సిగ్గు సింగారము. ధరించునది ధర్మపు పట్టు పీతాంబరములు. ఎంత అందమైన చీరె. నీతి సంపదల చెమికీ పువ్వులు మెరియుచున్నవి. తలపైనున్నది శీలపు రతనాల మకుటము. అలంకరించుకున్నది - సౌశీల్యాభరణములు. ముఖమున దిద్దినది ఆత్మశక్తియను చక్కటి కుంకుమ బొట్టు — ఇట్టి అపూర్వ సౌందర్యములతో శోభించుచున్న భారత మహిళ మన సంస్కృతీ సంరక్షకురాలవడంలో సందేహమేమున్నది !

అయితే ఇప్పుడు వచ్చిన ఆపద ఏమి ? అదే మనము నేడు విచారించుచున్న విషయము. దేశములో అవినీతి ప్రబలిపోయినది అరాజకం పెరిగిపోయింది. ఆధ్యాత్మిక ఆశక్తి క్షీణించిపోయింది - నైతికంగా దేశము పతనమై పోవుచున్నది. కారణము కొందరి

భారతీయ రమణీమణుల అజాగ్రత్తయే వారి జాగ్రదావస్థ. వారి విదేశ అనుకరణా వ్యామోహమే. పరదేశ పరిపాలనవలన ఏర్పడిన దాస్యము నేటికి స్వతంత్ర భారతములోనూ అలవాటై నిలచి యున్నది. ఆ దేశము, భాష, ఈ దేశము వేషము, మరియొక దేశము మతము, ఇంకొక దేశము జీవిత విధానము నేడు మనకు అనుకరణీయములైనవి. స్వార్థము మానవ హృదయములో పుట్టి వికృతంగా పెరిగి ప్రపంచమంతా వికటాట్టహాసముతో భయంకర నృత్యము చేయుచున్నది. ఆ నాట్యానికి భ్రమసి, భయపడి, రిచ్చపడి, భారత మహిళలు శతాబ్దాలనుంచి అధిష్టించిన అగ్రస్థానముల నుండి దిగజారుచున్నారు.

నన్ను జూడు, నా అందము జూడని తమ దేహములను అందరికీ ప్రదర్శించుచూ, కామక్రోధమద మాత్సర్యములలోకి తమతోపాటు పురుషులను బిడ్డలను కూలద్రోయుచున్నారు. అసంతృప్తితో, పేరాశతో విలాస జీవితాపేక్షతో ధనకాంక్ష పెరిగి, సప్త వ్యసనములకు దారి చూపుచున్నారు. విజయ గర్వముతో కన్నుమిన్ను గానక దైవభక్తి నశింప నాస్తికులై వ్యర్థులగుచున్నారు. ఈ అనుకరణ ప్రభావముచే భారత మహిళలు తమకు పరం పరంగాసిద్ధించిన పవిత్రతను త్యజించి స్వలాభాపేక్షతో స్వార్థముతో అనుకరణాభ్యాసములో పడిపోయి రేని వారికిగాని, దేశానికిగాని, మానవాళికిగాని క్షేమముకాదు.

ఇప్పటికైనా భారత మహిళలు తమ సోదరీమణులు కొందరు వేస్తున్న తప్పటడుగులు గుర్తించి అధోగతిని పడిన వారికి చేయూత నిచ్చి ఉన్నత శీలసంపద కౌస్తుభహారము ధరించి భారత మహిళ పవిత్రత కాపాడుట అవసరము.

ఈ విషయము పూజ్యగాంధీ మహాత్ముడు అనేక సారులు హెచ్చరించాడు. నేడు సజీవులైయున్న పండితులు, రాజకీయ నీతిశాస్త్ర వేత్తలు. మతగురువులు- వేదాంత కోవిదులు, ఈ విషయాన్ని మనకు అనేకసార్లు అనేక విధముల హెచ్చరించుచున్నారు. అసంతృప్తి జీవితములు గడపుచూ, కృత్రిమాలంకరణలద్వారా అందరినీ ఆకర్షింపనెంచుచూ. పాశ్చాత్య ఆలోచనాభ్యాసములోబడి విచక్షణాజ్ఞానము నశింప చేసుకుంటూ సక్రమ ప్రవర్తనవీడి స్వార్థపూరితమైన జీవనము గడుపుటకు మన సోదరీమణులును తయారైనారు. ఈ విధముగా ఈ రోగము అవిచ్ఛిన్నముగా కొనసాగునేని, మనజాతి, మన సంస్కృతి, మన దేశము నశింప గలదు.

కావుననే మా శంఖారావము - తమ ప్రవర్తన వలన దేశాన్ని కాపాడేశక్తి మహిళలో యున్నదిగనుక ఆమె జాగ్రత్త పడాలి. నైతికంగా దేశాన్ని రక్షించాలి తప్పటడుగు వేస్తున్న వారికి తప్పు చూపించి జాగ్రత్తగాముందడుగు వేయునట్లు చేయాలి. శుభమంటూ కుడికాలు ముందు పెట్టించి పవిత్రమైన ప్రదేశాలలో అంటినదల్లా పవిత్రముచెయ్యాలి. బిడ్డలకు. పురుషులకు త్రోవచూపాలి. శరీర మాధ్యం ఖలుధర్మ సాధనము - ధర్మ సాధనకే శరీరము, పుట్టుట గిట్టుట కొరకే. పుట్టలోని చదలు మాత్రము పుట్టదో గిట్టదో? "ఏపూర్వ పుణ్యమో ఏయోగ బలమో" వలన జన్మించినాము ఈ భారతదేశములో. పుట్టినందుకు మన జీవితము సార్ధకము చేసుకోవాలి. అదే సర్వ వేదాంతసారము. అదే మతముల మతము, లేనిచో అట్టివారు జీవన్మృతులే యని నేను నేర్పిన విద్య చెప్పు చున్నది.

స్వరాజ్యము సిద్ధించింది. నైతిక పతాకము భారత మహిళలు ఎగురవేయాలి, ఆంధ్రమహిళలది ఎప్పుడూ ముందడుగే!



# ఇది భారతీయ సంస్కృతియా? సంప్రదాయమా?

ఒక్క మనిషి ఏదైనా వింతైన పని చేస్తున్నప్పుడు లోకము మొదటలో విస్తుపోయినా తరువాత ఆ మనిషిని నిలవేసి అడుగుతుంది- కాని కొంతమంది చేరి అదేపని చేస్తే లోకము పరి పరి విధాల తలపోస్తుంది. కాని ఆ వింతైన పనినే విద్యాధికులు, విజ్ఞులు చేస్తే ఎబ్బెట్టుగా వుంటుంది. ఒకసారి రెండుసార్లు అయితే పోనీలేనవి లోకము ఊరుకోవచ్చు- కాని అదే అలవాటుగా చేస్తే ప్రమాదమున్నదని లోకము గ్రహించగానే ధైర్యము చేసి ఎదిరించవచ్చు.

మన సాంఘిక రాజకీయ జీవితాల్లో కొన్ని కొన్ని విషయాలు ఇట్లాగే వున్నవి. కొంతమంది తెలివిగలవారు, విద్యాధికులు, విజ్ఞులు, వివేకులు వింతపనులు చేయటము ఆరంభించారు- మొదట్లో అవి కొంచెము వింతగానూ, విడ్డూరముగానూ కనపడ్డవి. ఏదో తమాషాకి చేస్తున్నారు కాబోలు అనుకున్నది లోకము. కాని అట్టి వింత చేష్టలన్నీ మళ్ళీ మళ్ళీ చేయటము మొదలెట్టేటప్పటికి- అది తమాషాకు చెయ్యడము కాదు. అది కొత్తగా కలిగిన వికారమని తెలుసుకోగలిగింది.

ప్రస్తుతానికి అటువంటి వికార కృత్యములలో ఒక్కటి పరిశీలించుదాము- మనదేశ నాయకులు ఎచ్చటికైన వచ్చినప్పుడు గాని, వారి

జన్మదినోత్సవములు మొదలగునవి జరిగినప్పుడుగాని విదేశ నాయకులు మన దేశ పర్యటనకై వచ్చినప్పుడు గాని వారికి స్వాగతము చెప్పుచున్నాము- మనఃపూర్వకముగా వారికి అతిథ్యమిస్తున్నాము- మర్యాదగా వీడ్కోలిచ్చి సాగనంపుచున్నాము. అంతవరకూ బాగానే వున్నది.

కాని ఈ వచ్చిన పెద్దమనుష్యులకు, నాయకులకు ఎక్కడ బడితే అక్కడ, ఎవరుబడితే వారు ఇంత కుంకుమ చేతిలో వేసుకొని మొహాన మెత్తటానికి కారణమేమి? అది వారిని గౌరవించటానికి చేస్తున్నపనా? లేక వారిని మన ఆడవారితో సమానముగా చేసి మరీ గౌరవించదలచుకొనా? అంతటితోనే ఆపివెయ్యటమెందుకు. కాళ్ళకు పసుపు పూసి, మొహాన కుంకుమ బెట్టి, చేతులకు గాజులు కూడా తొడిగితే ఆ మర్యాద అద్వితీయముగా వుంటుంది. ఆ పెద్ద మనుష్యులకు మగవారే బొట్టు పెట్టితే అది- కొత్తగా పురుషులు స్త్రీలవద్ద నేర్చుకొని అవలంబింపదలచుకొన్న పద్ధతి అని మహిళా లోకము సంతసింపవచ్చుకూడా. కాని అదే స్త్రీలచేత, బాలికలచేత చేయించినప్పుడు ఎవరికైనా ఎంతటి విశాల దృక్పథము కలవారికైనా వికారముగానే కన్పట్టక మానదు— పేరంటములలో, ఇండ్లకు వచ్చినవారికి స్త్రీలు స్త్రీలకి కుంకుమ తాంబూలాలు ఇచ్చి గౌరవించటము మనమందరమూ ఎరుగుదుము- పెండ్లి పేరంటముల సమయములలో కూడ వచ్చిన పురుషులకు చందన తాంబూలాది సత్కారమేగాని కుంకుమ పెట్టుట మనలో సాంప్రదాయముకాదు- అట్టి సాంప్రదాయము మన భారతములో ఎచ్చటా విన్నట్టులేదు- కాబట్టి ఇది కొత్తగా ఆరంభించిన పద్ధతా? క్షత్రియ కుటుంబాలలో పురుషులు యుద్ధానికి వెళ్ళేటప్పుడు వారిని ఆశీర్వదించి తల్లిగాని, సోదరి

గాని. (ఆ పురుషుని కన్న పెద్దవారే అట్టి ఆశీర్వచనమునకు అర్హులు.) కుంకుమబొట్లు పెట్టుట అలవాటున్నది- లేదా, ఆ పురుషునికన్న చిన్నవారిలో ఆయన భార్యకే అట్టి హక్కున్నది- వీరపత్ని వీరునకు వీరకుంకుమ పెట్టే ఆచారమున్నది. కాని ఎవరో ఊళ్ళోవాళ్ళకి అశుభము సుభము ఎరుగని బాలికలచేత, సుమంగళుల చేత, కాలేజీ విద్యార్థినులచేత పెట్టించటము సబబుగావున్నదా? వచ్చిన విదేశీయులకు కుంకుమ పెట్టటములో అర్థమేమిటి? వారిని గౌరవించి వారికి సుస్వాగతమివ్వటమే ఉద్దేశమైతే వేరే విధానాలు లేవా? రాజకీయ నాయకులకు మత సాంప్రదాయానుగుణంగా స్వాగత మివ్వవలసిన అవసరమేమున్నది? రాజకీయ పద్ధతులలోనే గౌరవించవచ్చు- స్వాగతము చెప్పనూవచ్చు- సదుద్దేశముతోనే ఈ విదేశీయులకు మనవాళ్లు కుంకుమబొట్టు పెట్టి సత్కారము చేయుచున్నా, చూచేవాళ్లకు, మన సాంప్రదాయములు ఎరుగున్నవారికి. అది హాస్యాస్పదముగా. ఎబ్బెట్టుగా వున్నవి, ఆ విదేశీయులకు ఈ తతంగమంతా ఒక తమాషాగా యుండి యుండవచ్చు- అంటే ఈ కుంకుమ పెట్టడాన్ని ఒక తమాషాగా మనంతట మనమే చేస్తున్నామన్నమాట!

మన దేశములో కుంకుమ బొట్టు పెట్టేది మరియొక స్థలమున్నది. అది వైష్ణవాలయమైతేనే. మళ్లీ శివాలయములోనైతే స్త్రీలకూ విభూతి ప్రసాదము. కాబట్టి ఈ విదేశ నాయకులని ఏదేవాలయమునకైనా తీసుకొనివెళ్ళి అక్కడ కుంకుమ పెట్టితే అభ్యంతరముండక పోవచ్చు-

పూజ్య హిందూ స్త్రీకి శోభాయమానమై అమూల్యమై, ఆభరణమై, పవిత్రమైన కుంకుమను భారతీయులే దుర్వినియోగము చేసి

అగౌరవిస్తుంటే చూచి లోకము సహించలేదు- ఈ వచ్చేపోయే మగ వారికి కుంకుమబొట్టు మన స్త్రీలచేత పెట్టించటము మనకు మర్యాద కాదు- మన భారతనారీ గౌరవానికే కళంకము.

ఇది భారతీయ సంస్కృతియా? సంప్రదాయమా? పూలదండలతో ఈ గౌరవ మర్యాదలు ఆరభించినప్పుడు సహించినందులకు ఇప్పుడు కుంకుమకే కంటకము వచ్చినది. కొత్తపద్ధతులు అవలంభించవలసివస్తే పురుషులు తమ వచ్చివచ్చిన పద్ధతులు అవలంబించవచ్చు. కాని స్త్రీల వ్యవహారములజోలికి వస్తే ప్రమాదము-

ఇది లోకంపోకడ- చెట్టు చెడిపోయే కాలానికి కుక్కమూతి పిందెలు!!



# సంగీత కళా రహస్యనిధి

అసహ్యాముగా వున్నదాన్నెప్పుడూ అది ఎందుకు అసహ్యాంగా వుందీ అని ఎవరూ పరిశీలించి చూడము. కాని అదే ఏదైన సుందర మైనదైతే అది ఎందుకు అందముగా వున్నదో, ఎంత అందముగా వున్నదో తేరిపార చూచి, తర్కించి, వితర్కించి తృప్తిపడతాము.

ప్రపంచములో ఏడ్చేవాళ్లు ఎంతమందో వున్నారు- కొంత మంది ఏడుస్తూ వుంటే- ఆ చేపలచట్టంత మూతి, చింకికళ్లు, హాలకము చూస్తే అసహ్యామేస్తుంది. కొంత మంది బుడిబుడి ఏడుపులు చూస్తే చీదరేస్తుంది. మరి కొందరు బుంగిమూతి పెట్టుకొని కన్నీళ్లు కారుస్తుంటే జాలివెయ్యొచ్చు-కాని ఏడ్చేటప్పుడు అంగాలు చిందులు తొక్కేదెప్పుడు?

బోసినోరుబిడ్డ. బుగ్గలు సొట్ట బడుతూ. అయోమయంగా తగుస్థాయిలో ఏడుస్తుంటే ముద్దుగా వుంటుంది. కాని అదైనా హెచ్చుస్థాయిలో అయితే 'నోరుముయ్యి' అని అనిపిస్తుంది.

కాని ఏరోగములోనైనా ఏ శ్రుతిలోనైనా ఆ ఏడ్చేఏడుపు అందంగా వుండేది, ఏ భామామణైనా ఏడ్చేటప్పుడే. సన్నస్థాయిలో మెల్ల మెల్లగా ఎక్కడైన స్త్రీ ఏడ్చిందంటే చుట్టూ ఒకగుంపు

మూగుతారు, "ఆడమషి ఏడుస్తూంది- ఎందుకో పాపము !" అని మహా సానుభూతి చూపెడుతూ చుట్టూ మూగుతారు, నిజంగా వాళ్ళకి ఆ ఏడ్చే వాళ్ళమీద దయకలిగా? ఆ ఎడ్పు స్త్రీ ఏడుస్తున్నది గనుక. అది సహజంగా సంగీతము వలే అందరినీ ఆకర్షిస్తుంది.

సంగీతములో రకాలున్నట్లే ఏడ్పులో రకాలు లేకపోలేదు. స్త్రీపడ్పనబడే సంగీతము రసవత్తరఘట్టాలలో జనించినప్పుడు, మరీ రసవత్తరంగా, రమణీయంగా, హృద్యంగమంగా వుంటుంది.

ఈ సంగీతానికి రాగాలు లేకపోలేదు. ఈ సంగీతము ఏ గురువు వద్దనో నేర్చుకునేది కాదు. ఉదయము ఎడు గంటలకు లేచి పొరుగింటి వారు నిద్రపోకుండా సాధన చేసేదీకాదు. నెలకు రూ 50 లు॥ అర్పించుకొని మాష్టరుగారి వద్ద నేర్చుకునేదీకాదు- ఈ సంగీతము సహజంగా జీవితంతో వస్తుంది. కష్టనష్టాలే గురువులు.

ఈ సంగీతమే స్త్రీల చేతిలోని బ్రహ్మాస్త్రమని కొందరు ఉక్రోషము పట్టలేక అంటారు. అబల చేతిలోని అస్త్రము కూడా సున్నితముగా వుపయోగించినా బ్రహ్మాస్త్రమై పోతుందని పెద్ద లంటారు. ఈ బ్రహ్మాస్త్రము హైడ్రోజన్ బాంబు, ఆటంబాంబులవలే ఇతరులకెట్టి నష్టము కలిగించ కుండానే తాము ఆశించినవాటిని సాధించిపెట్టగలదట. సత్యభామ ఈ అస్త్రముతోనే పారిజాతాన్ని సంపాదించినదట. అంటే ఈ అస్త్రము కొంచెము పాశుపతాస్త్రము వలె వేసినవారి దగ్గరకు తిరిగి ఫలితాన్ని తీసుకొని వస్తుందన్న మాట. సత్యభామకు పారిజాతం దొరికినట్టు - లభిస్తుందని గ్రహించాలి. ఒకప్పుడది కాసుల పేరు కావచ్చు, మరొకప్పుడది పండుగకు క్రొత్త

చీరెకావచ్చు. అది ఏదైతేనేమి స్త్రీ ఆ బ్రహ్మాస్త్రము వేయగానే అది లభించుట తథ్యము.

ఈ స్త్రీల ప్రత్యేక బ్రహ్మాస్త్ర సంగీతరోదనమున్నదే- ఒక్కొక్కప్పుడు మించి రసవత్తరమైన ఘట్టాలలో దయానురాగ రసాలతో కూడుకొని వుంటుందట అది రసికాగ్రేసరులకు తప్ప తెలియక పోవచ్చునట. కొంత వరకైనా రసికతవుంటే అట్టిఘట్టాలలోని రమ్యత బాగా ప్రత్యక్షమై హృదయానికి ఆనందాన్ని కలిగిస్తుందట.

అందుకనే మానవులు, కవులు కథానాయకులు పనిగట్టుకొని స్త్రీలచేత. నాయికలచేత, ఆరున్నొక్క రాగములో ఆలాపింప చేస్తారట....

ఈ చిత్తవృత్తి సామాన్య మానవులకు. సామాన్య కవులకే గాక మహామహులకూ ఇదే అలవాటు.

కొందరు "కలస్వనంబుతో" ఏడ్పించితే.

మరి కొందరు. "బాల పల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠి వధూకల కాకలీధ్వని"తో ఏడ్పించారు.

దానితోకూడా తృప్తి పడనివారు 'కిన్నెర వధూరాజత్క రాంభోజ కాంభోజీమేళ విపంచి కావర సుధాపూరంబు తోరంబుగా' ఏడ్చే కచ్చేరి చేయించి ఆ ఏడ్చే భామామణికి "సంగీత కళారహస్య నిధి" అని బిరుదుకూడా ఇచ్చారు.

ఈవిషయాన్ని కవులభాషలో చెప్పాలంటే రామకృష్ణుని మాటల్లోనే చెప్పాలి.

"అల్లసానివాడు అల్లనల్లన యేడ్చె
ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా యేడ్చె
భట్టుమూర్తి బావురుమని యేడ్చె"

అంతవరకూ బాగానే వున్నది కాని "సంగీత కళా రహస్య నిధి" బిరుదుకుపోటీపడి ఎక్కడపడితే అక్కడ కచ్చేరి పెట్టినా లాభ ముండదు. రికమెండేషను చేయించుకున్నా లాభముండక పోవచ్చు.

మామూలు సంగీతమైతే అందరికీ రాకపోవచ్చును గాని, ఈ పై రకము సంగీతముతో మన అందరికీ ఇంతో అంతో పరిచయజ్ఞాన మున్నది. కాని ఎప్పుడైన అటువంటివి ప్రదర్శించే వారికన్నా ప్రేక్షకులే ఆనందిస్తారన్న విషయము గ్రహించుకొని ఎల్లప్పుడు ప్రేక్షకులలో ఒకరు గానే వుండటము వివేకము.



## ప్రేమ తత్వము అర్థమయిందో లేదో మరి :

మా యింటబుట్టిన పిల్లదానికి ఎంకి పేరే పెట్టాము— "ఇంటింట నీ పేరు పెడతారు" అనలేదా? ఆ మహానుభావుడు. మా ఎంకి మగడు నాయుడుబావ వంటివాడు కాడు. కాస్తోకూస్తో పోలికుంటే కాంతం 'మగని' పోలిక లుండవచ్చు. పెద్దగా పోలికలున్నా లేక పోయినా పేరులో మాత్రం వున్నది పోలిక—మా ఎంకి కాంతయ్యల దాంపత్యము పెద్ద రొమాంటిక్ వ్యవహారము కాదు — సంఘసేవా కుంభకోణమూ కాదు-

బాల్కనిలో రోమియో, జూలియట్ల వలె పెండ్లి ముచ్చట్లు ఆరంభించంక పోయినా "మా నాన్నకోసము కట్నము బేరము"తో ఆరభమయిన ఎంకి కాంతయ్యల పెండ్లిబేరము శుభాంతముగానే జరిగిపోయింది.

కట్నాలు కానుకలు జరుగవలసినవి, జరుపవలసినవి జరిగినవి. అలుకలు గినుకలు రానూవచ్చినవి. పోనూ పోయినవి. ఎటొచ్చి కొత్త పెండ్లికొడుకూ, పెండ్లి కూతుళ్ళకు కొంచెము 'వరీ' వివాహ కాలమందు — అత్తగారి హుకుమ్ కాలమందు లేకపోలేదు. అయినా గతజల సేతుబంధము వల్ల లాభమేమి?

ఎంకి కాంతయ్యలు బస్తీలో స్వంత కాపురము పెట్టేటప్పటికి ఎంకికి అమాయకత్వముపోయి ప్రౌఢత్వము వచ్చింది. కాంతయ్యకు

ఎంకిమీద మోజు తగ్గనూలేదు- కాని, ఎటొచ్చి హనీమూను రోజులు పోయి 'ఒకబ్బాయికి' తల్లి తండ్రులైనారు. ఇప్పుడు వారి వ్యవహారము ఎంకి కాంతయ్యల వ్యవహారముకాదు. ఒకబ్బాయి అమ్మ–ఒకబ్బాయి నాన్నకుగల సంబంధబాంధవ్య వ్యవహారము. ఈఅబ్బాయి పదహారణాల గోంగూరే!

అయినా ఎంకి కాంతయ్యల ప్రేమ కలాపములు —ఏనాడూ ఎవ్వరికీ అర్థంకాలేదు. మరి రసికులకు, రసజ్ఞులకు అర్థమయిందోలేదో! చాలీచాలని జీతముతో కాంతయ్య కాంతం మొగుడల్లే ఎప్పుడూ సతమతమవుతూనే వచ్చాడు. ఎంకితో తీర్థమెళ్లుదామని నాయుడుబావల్లే కాంతయ్య రామేశ్వర యాత్రకు సన్నాహము చేసినప్పుడు ఎంకి ఎంకల్లే రణపెంకై రామేశ్వరమూలేదు గీమేశ్వరమూ లేదంటే కాంతయ్య ఎంకిని పుట్టినింటికి పంపననీ పట్టుపట్టాడు. కాని లేడీ డాక్టరు ఇంట దర్శనముతో ఆ కోపము పటాపంచలైంది. ఎంకి కాంతయ్యలు బస్తీలో శ్రీమతి వంకా శ్రీ కాంతారావులుగా రూపమొందినా స్వతహా ఎంకీ కాంతయ్యలుగానే వుండిపోయారు.

కాంతరావు తెచ్చిన నాలుగురాళ్ళతో సంసారము ఎట్లాగో దొర్లించింది. ఎంకి చుట్టాలకి పీటలమీద, వంక చుట్టాలకి బల్లలమీద భోజనాలు వడ్డించి పొరుగింటి అన్నపూర్ణ - గృహలక్ష్మి అనిపించుకుంది, పిలున్నప్పుడు కాంతారావుతో సినిమాకు వెళ్ళి, క్లబ్బుకువెళ్ళే కాంతరావులో 'యింట్లో పనుందో' వంట్లో బాగుండలేదనే నెపముతో ఇంటిలోనే వుండి కాంతారావుచేత తనను వలచి వలపించుకోగల్గింది. వాళ్ళకొచ్చిన లోటులేదు, ఎంలోటు లేదనుకుంటుండగానే 'పదహారణాల గోంగూర గుంటడు' నూనూగు మీసాలవాడై కాలేజీ

సీట్లకోసము వేటమొదలిడినాడు. వంకా కాంతారావులు డ్రాయింగు రూములో కూర్చొని 'ఎన్నాళ్ళో మనకీ సుఖాల'ని అనుకొంటుండగానే వంక హృద్రోగంతో కళ్ళు మూసింది.

"ఎంకి వంటి పిల్ల లేదోయి లేదోయని" కాంతారావుకి ఎవరో చెప్పుతుంటే "చచ్చిన వాళ్ళకి చారడేసి కళ్ళు గావాన" అని ఆలోచించుకుంటూ వుండగానే శీతజ్వరము కాంతారావుకి ముక్తినిచ్చింది. సీట్ల వేటమాని యువకుడు— "ఏ పుణ్యభూమిలో...." అని అలాపించుకుంటున్నాడు.

ఈ సముద్ర ఘోషలో ఈ శ్రావ్యకంఠము ఆలాపన వినబడుతుందో లేదో?



# మోక్ష సాధనా ?

మన దేశములో ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రాలకు కరువులేదు. పుణ్యపురుషులకు కరువులేదు. ఆమాటకొస్తే పుణ్యస్త్రీలకూ కరువు లేదు.

ఏదో ఫలము కోసము. ఏదో కోరికతో దైవస్థలాలు, పుణ్యక్షేత్రాలు, నోములు. వ్రతాలుచేస్తున్నానని యితరులుఅనుకుంటారేమోనని భయమున్నన్ని రోజులు వాటి జోలికి పోలేదు, ఆ భయము క్రమ క్రమంగా తగ్గుతూ రాగా ఆ క్షేత్రాలు పుణ్యావంతుల సందర్శన భాగ్యము చేయాలనే అభిలాష కలిగింది. అట్టి అభిలాషే రెండెడ్ల బండిలో కాకాని తీసుకొని వెళ్ళింది.

ఉమామహేశ్వరులిక్కడి ఆరాధ్య దైవములు. గుడి చిన్నది. ఆవరణ పెద్దది. కాని ఏమి కోలాహలము ! సినిమా సంగీతముతో ప్రభలు—రెండు గజాల ఎత్తువి దగ్గరనుంచి తాడెత్తు ప్రభలు- ఆ ప్రభలకు చిత్ర విచిత్ర అలంకరణలు- మనకు తెలిసినన్ని దేవుళ్ళ చిత్రపటములతో అలంకరణ- రంగు రంగు కాగితములతో ముచ్చటైన ఆ అలంకరణ- దొంగరాముడు, అగ్గిరాముడు, భలేరాముడు అనే ఎడ్లు పొట్టేళ్ళు, బర్రెలు, ఆవులు, దూడలు, నందివిగ్రహాలు, పసిపిల్లలు తల్లుల చేతుల్లో పొత్తిగుడ్డల్లో తంత్రులమీద బుజాలమీద; సంతానము

లేని భార్యా భర్తలు తడిబట్టలతో పెంట్రుకలు విరబోసుకొని, బ్రహ్మ ముళ్ళు వేసుకొని దేవాలయము చుట్టూ గిర గిర తిరుగుతున్నారు. ఎంత నమ్మకముంటే అట్లా తిరుగ గలుగు తున్నారో? లేక 'వాంఛ' అనేది అట్లా ప్రోద్బలము కలిగిస్తుందా? వాంఛ, నమ్మకము, వివేకాన్ని, అభిమానాన్ని, మానాన్ని, ఆహాన్ని కూడా నిర్మూలము చేయగలదా? గుడి వెనకాల తడిగుడ్డలతో నిద్రాహారాలు సరిగా లేకుండా రాత్రనక, పగలనక, మండువేసవిలో, మంచిచలిలో స్త్రీలు ప్రాణాచారాలు పడివున్నారు - ఆ మల్లికార్జునస్వామి పలికితేగాని లేవరట! ఔరా ఏమి నమ్మకము! స్త్రీలకు మాత్రమే కలగటానికి కారణమేమో. లేక అది 'వాంఛ' అయితే అదికూడ స్త్రీలకు మాత్రమే ఏల కలుగుతూ వుందో! ఈ కలియుగంలో ఆ భగవంతుడు భక్తుల ఆర్తనాదాలు వినగలడా? వినిపించుకుంటాడా? వినుపించు కుంటే అభయమిస్తాడా?

ఈ యుగంలో దేవుళ్ళకు ఏకారణమువల్ల, ఏటాన్సిల్సు వగైరాలాంటి వ్యాధులవల్ల సరిగా వినబడటములేదని నా నమ్మకము. విద్యుద్దీపాలవల్ల వారికి లాంగ్ సైటు, షార్టుసైటు ఏర్పటివుండి, సులోచనాలు వాడకపోవుటవల్ల సరిగా కనబడటముకూడా లేదేమోనని నా భయము. కాని బాగా అధ్యాత్మిక చింతనానుభవముగల ఒక సోదరీమణి నాకు ఈమధ్య ఒక చక్కని ఉపదేశము చేసింది. ఆ ఉపదేశము ఏమంటే అహము అనేది పోతేగాని భక్తి అనేది కుదరదట. భక్తి కుదిరితేగాని అహముపోదు. ఇది పిచ్చి కుదిరితేగాని పెండ్లికాదు. పెండ్లిఅయితేగాని పిచ్చికుదరదు. అన్నట్టున్నది. కాని మాసోదరీమణి సహేతుకంగా నాకు తెలిపిన అనుభవైక విషయమేమిటంటే: ఆమె (బిడ్డలులేరు లెండి) ఆమె స్నేహితురాలు. (ఆడపిల్ల తల్లి) ఒకా

నొకప్పుడు భద్రాద్రిరాముని కొలిచేందుకు వెళ్ళారట. భద్రాద్రిలోనే నివాసము ఏర్పరుచుకొని పెక్కురోజులు భద్రాద్రి రాముని రామ దాసువలె కొల్చారట.

చివరకి ఒక రోజు ఇద్దరూ స్నేహితులైనారట. రామచంద్రుని విగ్రహము ముందు కర్పూర హారతిచ్చి యథాప్రకారము ప్రణమిల్లి నమస్కారము చేశారట. సంతానము లేని ఆవిడ తనకు సంతానము కావాలని మనస్సులోనే ప్రార్థన చేసుకున్నదట.

కాని ఆడపిల్ల తల్లి మాత్రము ఓ శ్రీరామచంద్రా, రామ భద్రా కోదండరామా నా లక్ష్మికి ఆడుకొనుటకు ఒక తమ్ముడినియ్యా వయ్యా తండ్రీ అని గుడి ప్రతిధ్వనించేటట్లు ప్రార్థన చేసినదట. మొదటావిడ అదిరి పడిలేచినదట. మిగిలినవారు కొందరు కిల కిల నవ్వితే కొందరు చిరునవ్వు నవ్వితే. మరి కొందరు బాగా నవ్వారట.

మళ్ళా శ్రీరామ నవమికి మొదటావిడ వట్టి చేతులతో వస్తే రెండో ఆవిడ లక్ష్మి తమ్ముడిని ఎత్తుకొని వచ్చిందట.

అంచేత ఆమె నాతో చెప్పిందేమిటంటే - "నాకు అహము చావలేదు." అభిమానముతో 'నా' అనేది వదులుకోకుండానే నేను ప్రార్థనచేశాను. కాని రెండో ఆవిడ సంపూర్ణమైన విశ్వాసముతో 'నా' అనే అహము. అభిమానము లేకుండా ప్రార్థనచేసింది. ఫలము దక్కింది. నాకివి యింకాపోలేదు. కాబట్టి నేను ప్రార్థన చేసినా లాభములేదని సూక్ష్మంలో మోక్షసాధన స్పష్టము చేసింది.

కాబట్టి ఈ ప్రాణాచారాలుపడే వాళ్ళందరికీ సంపూర్ణభక్తి యేనా ? సంపూర్ణ భక్తితో ఐహిక సుఖాలు సాధించవచ్చునా? లేక మోక్షముకూడా సాధించ వచ్చునా?

మోక్షము సాధించుట అంత సులభముకాదు. కాలేజికి వెళ్ళి బి. ఏ. డిగ్రీ సంపాదించట మంత సులభముకాదు. అని నా సోదరి ఒకామె హెచ్చరించింది. కొంత పూజ, భక్తి, యోగసాధన, నిర్వి కల్పసమాధి వగైరా వంతెనలు దాటుతూ మోక్షాన్ని సాధించవచ్చు నని తెలుసుకున్నాను.

అది సరిగా బోధపడేందుకు కష్టపడి పెనుమత్స వెళ్ళి పదునాలు గేండ్లు యోగసాధనచేసి నిర్వికల్ప సమాధిలోయున్న యోగిని స్త్రీ మూర్తిని సందర్శించాను. అనుమానాలు పోయి మోక్ష సాధనా పథము గోచరిస్తుందనుకున్నాను.

కాని ఆ దిగంబరయోగిని సందర్శన భాగ్యము కలిగిన తరువాత సందేహాలు అనుమానాలు చిత్రంగా మనసులో పెరిగి పోయినవి.

ప్రపంచములో వుండి ప్రపంచముతో సంబంధం లేకుండా వుండటమువల్ల లాభమేమి ? ఏదైనా అట్టి లాభమున్న ఆ లాభము తన ఒక్క వ్యక్తికే లాభమా ? లేక ఇతరులకుకూడా అట్టిలాభము కలిగించే అవకాశము లేదా ? అదే మోక్ష సాధనకు ఉత్కృష్ట మార్గమా ? ఐహిక ప్రపంచముతో సంబంధములన్నీ పెట్టుకొని స్వధర్మములు నిర్వహిస్తూ మోక్ష సాధనమెరుగా లేక రెండవ విధానము మెరుగా ? ఎవరికి వారు మోక్షముకొరకు తాపత్రయ పడుట ధర్మమా లేక ఇతరులకొరకు మోక్షసాధన ప్రయత్నము ధర్మమా ? ఏది వాంఛనీయము ?

ఈ విషయము మనము బాగా ఆలోచించవలసి యున్నది.

మూఢనమ్మకాలు మోక్ష సాధనలకు ఉపయుక్తమా? నిజమైన మోక్షమేది. దానికి సాధన లెట్టివి, యోగాభ్యాసము, ప్రాణాచారాలు. మ్రొక్కుట. పూజలు, పుణ్యతీర్థముల సేవ, నోములు. వ్రతాలు, పూజ్యుల సేవ, తామంతట తామవి పుణ్య కార్యములే కావచ్చును.

"కాని అవి ఆత్మ సంస్కారము. ధర్మసత్య జీవితములకన్నా, మిన్న కాదు. అన్ని ఐహిక సంబంధములు కలిగి, సంసారసుఖ దుఃఖములలో సంపూర్ణముగా మునిగి తేలుతూ స్వధర్మ రక్షణ చేసుకుంటూ సత్యవ్రతులై జీవనయాత్ర గడిపే వారికంటే యోగిని మోక్షసాధన అపేక్షించ దగినదికాదు. అది ఏ విధంగాను ఈ మార్గముకన్నా ఉత్తమమైనదికాదు. మూఢ నమ్మకాలు కూడా ఒకప్పుడు మోక్షసాధనలు కావచ్చును! 

# అంతా హాళక్కే

ఏడాది నాడు మనకందరికి "సెలవు" అని చెప్పి భాగ్యనగరానికి దారి తీసిన మిత్రులను మళ్ళీ కలుసుకున్నారో లేదో! సుమారు పడాదినాడు హైదరాబాదే ముక్కోటి ఆంధ్రుల చిరవాంఛిత రాజధాననుకుంటూ సంతోషించుతూ పురకలమీద వెళ్ళి పడ్డారు. మరి కొందరు రెక్కలు గట్టుకొని దిగారు. తీరా వెళ్ళినాక ఎన్నో సమస్యలు తెముల్చుకోవాల్సి వచ్చింది. మొదటి సమస్య "ఆంధ్రా వాళ్ళు" ఈ "ఆంధ్రావాళ్ళు" అన్న పదము కొన్నాళ్ళు మరీ భీభత్సము చేసింది. హైదరాబాదులోని కొంతమంది తెలుగువారు మరి కొందరిని "ఆంధ్రావాళ్ళు" అని అంటూవుంటే నవ్వాలో ఏమి చెయ్యాలో తెలియక తెల్లబోయారు మొత్తానికి మన ఆంధ్రావాళ్ళు. మొదట్లో ఈ పిలుపు ఎట్లావుందీ అంటే కొన్ని దేశాలలో వారు తమ భార్యలను గురించి చెప్పాలంటే 'నా భార్య' అనిగాని 'మా ఆవిడ'ని గాని ఘరానా గానూ అనరు. 'నిన్నే' 'పిలచేది నిన్ను కాదూ' అనికూడా ఆప్యాయంగా పిలవరు. కాని "నా కొడుకు తల్లి" అని 'నా కుమార్తె తల్లి' అని సంబోధించుతారు. ఎప్పుడైనా ఒక్కసారైతేగాని లేక కొన్ని కొన్ని ఘట్టాలలోగాని ఆ పిలుపు చాలా మనోరంజకంగా వున్నా అడపా దడపా వింటుంటే 'ఆంధ్రా వాళ్ళ'లాగా వుంటుంది.

ఇదిగాక హైదరాబాదులోని రెండవ పెద్ద సమస్య ఇంటి సమస్య "దొరికితే ఒక నవాబు అంతఃపురము లేకపోతే తూర్పుకు తిరిగి దణ్ణము వెట్టడమే శరణ్య'మనే మిత్రుల కబురే అక్కడ గృహ సమస్య వివరము బాగా తెలియపర్చుతుంది.

తూర్పుకు తిరిగి దణ్ణము పెట్టడమే సులభము. నవాబుల ఇళ్ళల్లో నవాబుల హంగులు లేకుండా ప్రవేసించితే చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవలసివస్తుంది.

పోనీ అంతటితో సరిపోయిందా? ఏ 'మంజిల్' ప్రవేసించాల్సినా ముందు ఆ యింటి పూర్వ చరిత్రాదులు కనుక్కోవాలి. అది చాలా ముఖ్యము అక్కడ. కారణము ఆ భాగ్య నగరులో భవనాలు సువిశాలమైనవి, కావటమువల్ల ఆ భవనాలలో నివసించే వారికి ఇష్టము లేకపోయినా దెయ్యాలు భూతాలు అనబడే జాతి జీవులుకూడా ఆ ఇండ్లల్లో స్థిర నివాసములు ఏర్పరచుకున్నవట. పాపము నవాబులు ఇళ్ళు ఖాళీచేసి "ఆంధ్రావాళ్ళ" కోసము వెళ్ళిపోయినా ఈ జీవులు మాత్రము వాటి స్థిరనివాస స్థానములందే వుండి 'New Commers' కి స్వాగతము చెప్పాయట. దానితో చూశారూ మహామహులు, పిరులు, శూరులైనకొందరు మన "ఆంధ్రావాళ్ళు" వెనక్కి చూడకుండా పరిగెత్తారట. కొందరు ధైర్యము చేసి వుండిపోయారు. కాని ఈ దెయ్యాల గోల వదలించుకోక ముందే గోరుచుట్టుమీద రోకలిపోటన్నట్టు 'భానమతి' ఒకటి దిగింది! ఇది ఒక రకము దెయ్యమో భూతమో అని అనుకునేరు. ఇది అది ఏదీకాదు. అయినా వాటికి సంబంధించినదే. మన దేశములో దానిని చేతబడి అని అంటూ వుండేవారు. ఇప్పుడు నవాబుల దయ వల్ల అది 'భానమతి'గా రూపొందింది.

మొన్న పత్రికల్లో చూచే వుండివుంటారు లక్ష్మీకాంత అనే అబ్బాయికి ఈ ఛానమతితో ఎంత తిప్పలు వచ్చిందో - నాలాగే మీకూ దెయ్యాలు భూతాలంటే నవ్వు వస్తుందనుకుంటా. మీరూ చూచివుండరు: నేనూ చూడలేదు. ఒకానొకప్పుడు ఒక దెయ్యమే నన్ను చూచి అసలు నా సంగతి వినేసరికి పరిగెత్తిపోయింది. రోజూ గేటు తీసి నౌకరు బయటకు రాత్రిళ్లు వెళ్ళుతున్నది గమనించి ఒక రోజు ఎవరికీ తెలియకుండా గేటు తాళము వేస్తే ఒక నౌకరుకు ఆ రోజు కాలికి దెబ్బ తగిలింది. కాలికేమొచ్చిందని ఉదయము నేను పరామర్శ చేస్తే 'రావిచెట్టుమీద దెయ్యమొచ్చి పిలచి కొట్టింద'ని జవాబు. 'ఈసారి దెయ్యము పిలిస్తే బయటికిరాకుండా బెల్ వాయించు లేచి దానిపని నేను చూస్తానని' అభయ హస్తమిచ్చాను. అంతే అంతటితో ఆ దెయ్యము హడలెత్తి పరిగెత్తిపోయింది. కాని హైదరాబాదులోని దెయ్యాలు భూతాలు శక్తులు ఇలాంటివి కాదట.

ఒక ప్రఖ్యాత దిన పత్రిక ప్రతినిధి అందించిన వివరాలివి. జేలా అనే నగర ప్రాంతంలో మాధవరావుదిగంబరరావు ఫాటక్ అనే గృహస్థు వున్నారు. అకౌంటెంట్ జనరల్ కార్యాలయంలో పని చేసి ఉద్యోగ విరమణచేశాడు. అతనికి ఇరువురు సంతానము. రెండో కొడుకు లక్ష్మీకాంత్. ఈ లక్ష్మీకాంత్‌కు మూడేళ్ళ క్రిందట మతి చెడిందనుకున్నారు. అయితే పరీక్షలముందు మాత్రమే మతి చెడేది ! (కొంతమంది విద్యార్థులకొచ్చే పరీక్ష జబ్బు మాత్రముకాదు పాపము) మతి చెడినప్పుడల్లా నీరసించిపోతూవుంటాడట. చదువులో తెలివిగలవాడే. అయితేనేం - పరీక్షలకు ముందు మతి సరిగా వుండదు. తల్లిదండ్రులు ఇది మతి భ్రమణం అనుకుని ఆసుపత్రిలో చేర్చారు. లాభం లేకపోయింది. పైగా జూన్ 1957 నుంచీ ఇంకా

ఎక్కువైంది. ఇంటి గోడలనుంచీ సున్నమూ రాళ్ళూ ఊడి అతడి మీద పడి గాయపరుస్తూ వుంటాయి. మేకులు వాంతి చేసుకుంటూ వుంటాడు. పోనీ ఆ మేకులు ఏ ఇంద్రజాలపు సరుకో అనుకుందామా అంటే వీలులేదట. అవి నాలుగేసి అంగుళాలు పొడుగుండి అందరికీ కనబడుతూనే వుంటాయట. సిరాబుడ్డినుంచి సిరా పైకి చిమ్ము తుంది. వ్రాస్తుంటే కలం పైకి ఎగిరిపోతుంది. ఎక్కడినుంచో ముళ్లు వచ్చి అతడి శరీరంలో గీట్లు గాట్లు చేసినెత్తురు చిమ్ముతూ వుంటాయి. ఆ యింట్లో పైగా కొన్ని వస్తువులు కొన్ని కొన్ని వేళ్ళల్లో వాటంతటవే విహరిస్తూవుంటాయి. మరో బెడద - ఆ పిల్ల వాని దుస్తులకు అమాంతం నిప్పు అంటుకుని భగ్గుమంటూవుంటాయి. వెంటనే ఆర్పేసుకోవాలి. ఇంటిల్లపాదికీ నరకప్రాయమైంది జీవితము. ఎక్కడనుంచో అరుపులూ ఆర్భాటాలూ వినవస్తూవుం టాయి. నాగపూరులో ఒక వ్యక్తి ఫాటక్‌కి శత్రువు – ఒకడున్నా డట. మరిది అతని ప్రయోగమేమో! ఫాటక్ సంసారమున లక్ష్మి కాంతకు తప్ప మరెవ్వరికీ ఈ బాధ లేదు. ఈ బాలునకు ఆ వ్యక్తి పేరు గోడలమీద తలుపులమీదా కనపడుతుందట. కాని యితరులకు కనబడదు.

ఫాటక్ ఒక భూత వైద్యుని పిలిపించాడు. ఆవైద్యుడొక కత్తిని తెచ్చి దాన్ని ఇంటి ఆవరణలో ఒకచోట పాతి రమ్మని మాధవ రావ్ ఫాటక్‌కు యిచ్చాడట. ఆ కత్తిని పాతేస్తే చేతబడి వమ్ము అయిపోతుందని చెప్పాడు. కాని ఆ కత్తిని పాతేసి వెనక్కు తిరిగాడో లేదో, అది లేచి బయటకు వచ్చి బయట బడింది! యిహ బాధ పడలేక ఫాటక్‌గారు పోలీసుల సహాయాన్ని ఆపేక్షించారు.

వాళ్లు అన్నీ చేశారు. నియమిత ప్రభుత్వ వైఖరిలో ద్రోహి

అచూకీ తెలుసుకొనుటకు [redacted] వివ రాల నన్నింటినీ ఒక నివేదికగా [redacted] తరువాత కిం కర్తవ్యము అనుకుంటున్నారట. కారణము పూర్వము నవాబుగారి హైములోనే ఒక యూరపియన్ పోలీస్ ఇన్స్పెక్టర్ జనరల్ ఈ ప్రయోగాలపైన విచారణ జరిపించాటడట. ఈ 'భానామతి' అనే ప్రయోగము కులమత విచక్షణ లేకుండా ఇదొక కూటమి సాగిస్తున్న నికృష్టపు మంత్ర తంత్రాల తతంగం అని తేలింది. హైదరాబాదులో కొందరు క్షుద్ర ఉపాసకులు "నువ్వు ఆట్ గుడివి అవుతే నేను బారా గుడిని" అని అనుకుంటూ వుంటారు. (ఆ సంఖ్యలు గొప్పలు తెలియ జేసేవట: ) ఇంతకీ ఈప్రయోగాలు చేసేవాడిని పట్టుకోటానికి 'బారాగుడి' పనికిరాదు. అఠారాగుడైతే ఏమైనా లాభముంటుం దేమో! ఇలాటి ప్రయోగాలు చేసేవాడిని పట్టుకుని వాడిచేత 'చెప్పులో నీరు' త్రాగించి, ముందరి పళ్లు వూడగొడ్తే వాడికి ప్రయోగ శక్తి వుండదట. అట్లా పోలీసులు కొందరి పళ్ళు ఊడగొట్ట డము జరిగిందట!

దానివల్ల దంతవైద్యులకు తప్ప ఇతరుల కేమి లాభము లేక పోయిందట. దంతవైద్యులకు సహాయము చేయుటకంత ఇష్టములేక కొందరిని విడచిపెట్టారట. అసలు ఆరోజుల్లో ఈ క్షుద్రులను పట్టు కోడానికి కొందరు ప్రత్యేక పోలీసు లుండేవారట. కాని స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అలాటి పోలీసు విభాగాన్ని రద్దు చేశారు! రాజ్యాంగం ప్రకారము క్షుద్రశక్తులు లెక్కలోకి రావట. ఇక్కడ రాజకీయ వేత్తలు పప్పులో కాలు వేశారు. రాజ్యాంగము అనేది వేరే ఒక ప్రత్యేకమైన వస్తువా? ప్రజలకు సంబంధించినది రాజ్యాం గము కాదనటానికి వీలులేదు. వున్నదాన్ని రాజ్యాంగము లేదంటే

ఏమి లాభము, పైగా ఆ పొరపాటు వల్ల ఈ క్షుద్ర శక్తులు మరింత శక్తి సంపాదించుకొని ఏ రాజకీయాలనో, ఏ రాజకీయ వేత్తల వెనకో నక్కి, నానాహంగామా చేయవచ్చును. కావున అప్రమత్తతకూడదు.

రాజును రాజేపట్టాలి. దొంగను దొంగే పట్టాలి. అట్లాగే క్షుద్రశక్తిని క్షుద్రులేపట్టాలి. అటువంటి వారు దైవవశాత్తు మన రాష్ట్రంలో లేకపోతే తయారుచెయ్యాలి. అవసరమైతే వాళ్లకి, స్కూళ్లు, కాలేజీలు పెట్టి, నివసించటానికి హాస్టలు సౌకర్యాలు ఏర్పాటుచేసి వారిని తయారుచెయ్యాలి. 'ఖానామతి'ని శాస్త్రోక్తంగా క్షుణ్ణంగా నేర్వాలి. అవసరమైతే ఒక Up to date Scientfiic **Laboretary** గల పరిశోధనాలయము ఏర్పాటుచేసి దానికి సీట్లు ఏ కొద్దిమందికో ప్రత్యేక తెలివితేటలుగలవిద్యార్థుల కిచ్చి ఈ 'ఖానామతి' ప్రయోగాన్ని పరిశోధించే ఏర్పాటు చెయ్యాలి. అవసర మైతే ఒక డాక్టరేటుకూడా ఆ విద్యలో సృష్టింప వచ్చును.

ఈ స్పుత్నిక్ యుగంలో ఇలాంటి విషయాలు తెలుసుకోలేక పోవటము విచారకరము. ఏనాడో పుష్పక విమానము మాకు తెలుసు. అణుశాస్త్రము తెలుసు. కాస్మిక్ కిరణాల సంగతి మాకు తెలుసు. 'ఖానామతి' మాకు తెలుసు అంటే ఏమిలాభము? ఇప్పుడు కొందరు జీవులు ఈ ఖానామతి ప్రయోగమువల్ల నానా బాధలు పడు తున్నారు. త్వరపడి మనము ఈ ప్రయోగ విధానము తెలుసు కోవాలి. అది తెలుసుకున్న తరువాత దాని నిర్మూలన విధానము తెలుసుకొనుట చాలా సులభము. ఇంతలో ఏ విదేశమువారో ఇది తెలుసుకునే ఘనత సంపాదించుకునే ముందే మన వాళ్లు త్వరపడి అవిరళ కృషిచేసి ఈ "ఖానామతి" ప్రయోగాన్ని, వివరాలన్నీ

కులంకషముగా సేకరించాలి. ఈమధ్య నిర్విరామంగా వెలువడిన డిటెక్టివ్ నవలలు చదవి. 'ఎప్పుడు ! ఎప్పుడు ! పరిశోధన చేయాలను' కునే నవయువతీ యువకుల కిదొకదివ్య అవకాశము. ఈఅవకాశాన్ని పురస్కరించుకొని. వాళ్లపళ్లు. వీళ్లపళ్లు వూడగొట్టగుండా ఈ సమస్య పరిష్కరించి అసలు ప్రయోగకుల ఆచూకీ తెలుసుకోవాలి. లేదా ఈ ప్రచారకుల అంతైనా కనుక్కోవాలి, అదీ, ఇదీ చేతగాకపోతే అంతా హుళ్లక్కే నని మనము అనుకోవాలిసి వస్తుంది. 

# ఆకలెచటనుండు నరయ గాను

ఆని అన్నాడు ఒకవి. ఏనాడో అన్నాడు గనుక సరిపోయింది గాని. ఈ రోజుల్లో ఇలాంటి మాటంటే ఆ కవిని హేళనచేసి క్యాపిటలిస్టు తొత్తు అని దూరేవారే. అదే ఒచోటా రాజకీయవేత్త అనుంటే ఆయనగారిమీద రోడ్డుమధ్య పి. డబ్లూ. డి. వారి కంకరరాళ్ళ వర్షము కురిపించేవారే. అదే కొంచెము అగ్రనాయక శ్రేణిలోని రాజకీయవేత్త అయితే గాలిదుమారము లేపేవారే.

స్వాతంత్ర్యము స్వాతంత్ర్యము అని ఎక్కడ చూచినా మన దేశములో సొదగాని వాక్స్వాతంత్ర్య మేది? ఆకలేమిటి ఆకలెక్కడుంది చూపించండి. అని ఎవరైనా ధైర్యముచేసిఅంటే ఇంకేముంది ఆ జీవి హతాశుడే. అందరూ రాతుసులల్లే "సుష్టుపూర్తిగా ముప్పొద్దు భోంచేసి మేడల్లో పట్టెమంచాలమీద పరుండే నీకు ఆకలెక్కడ కనపడుద్దీ మాకు మల్లే మాయింట్లో ఒకపూటతిని మావలె పనిచెయ్యి ఆకలెక్కడుండాదో కానొస్తాది" అనిపైన బడరూ?

ఉదయము లేచినప్పటి నుంచి రాత్రి నిద్రించే వరకూ పుట్టినప్పటినుంచీ మరణించేవరకూ మానవుడు భోజనము కొరకేకదా తాపత్రయ పడేది. తనకు తనవాళ్ళకి ఈ భోజన సంపాదనలోనే జీవితాంతము వరకు సతమత మవుతున్నాడు. ఆకలేలేకపోతే భోజన

మెందుకు? ఈ భోజనము కోసము మానవుల స్వప్రయత్నము చాలక ప్రభుత్వాలు కూడా దానికోసమే కదా కృషి చేస్తున్నవి. దేశములో ప్రజలకు ఆకలి లేకుండా వుంటే ఇంకా ప్రభుత్వానికి కావలసిన దేమున్నది. ప్రజలందరికీ తిండి. బట్ట పని కలిగించాలనే కదా ప్రభుత్వాల కృషి. అటువంటి కృషి ఈనాడు ఈ యుగములోనే ఆరంభం కాలేదు. రామాయణ కాలమునాడే అటువంటి కృషి జరిగిందని శ్రీరామ చంద్రుడికే అది అసాధ్యమైన పనిగా పరిణమించిందని "అన్నమో రామచంద్ర" అనేవారు అప్పటినుంచి ఇప్పటివరకు పెరుగుతూ వస్తూనే వున్నారనికాని రామాయణ కాలమునాడు సైతము రావణుని రాజ్యములో "అన్నమో రామచంద్ర" అనేవారు లేరని పెద్దలు చెప్పుతూ వుంటారు. కాబట్టి ప్రజలకు తిండి పుష్కలముగా కలిగించటము ఏ ప్రభుత్వానికైనా కర్తవ్యము. మన భారత ప్రభుత్వము స్వాతంత్ర్య సద్ది అనంతరము మొదటి పంచవర్ష ప్రణాళికతో తిండికరువు పరిష్కారమైనదని సంబర పడుతున్నారు. కాని రోజు రోజుకి పెరుగుతున్న జనాభాకు అనుగుణంగా తిండిగింజలను ప్రజలు అభివృద్ధి పరచగలరా అనేదిప్రశ్న? అదే ప్రభుత్వానికి విషమ సమస్య.

కాబట్టి ఈ తిండి సమస్య పరిష్కారము కావాలంటే ఆకలి లేకుండా వుండేటట్లు చూడాలి. యోగి వేమనైతే ఆకలి ఎక్కడుంది అని ధీమాగా అన్నాడు గాని అదే మనము 10 గంటల తరువాత అనగలమా? వాయు భక్షకులము కాకపోతిమి!

ఇంతకూ ఈ సమస్య ఏ విదేశపు "మిషను" తేల్చి పెట్టలేదు. ఎన్ని "వెన్ననూనె" "పాలడబ్బాలు" దిగుమతైనా తీరే సమస్య కాదు. ఈ సమస్య మనము తేల్చుకోవలసినదే.

మొదటిది జనాభా ఇంతగా పెరగకుండా వుండటం ముఖ్యం. అప్పుడు ఇప్పుడు స్థాపిస్తున్న ప్రసూతి కేంద్రాలేమవుతవని మనం విచారపడ నక్కరలేదు. ఇప్పుడు డాక్టర్లు, నర్సులు తలకు మించిన పనులు చేస్తున్నారు. అప్పుడు తాపీగా, చక్కగా తమపని చేయ గలుగుతారు.

పోతే భోజన సమస్య. ఇది తీరటానికి ఒక్కటే వుపాయము. భూదానము గీదానము ఏమి లాభములేదు. భోజన సమస్య తేల్చేది 'గ్రిస్తిక' మంత్రముతోనే ఈ మంత్రము జపించే మంత్రము కాదు. మంత్రాలకు చింతకాయలు రాలవు. అవి చెట్టువేసి పెంచి పండిం చాలి. సాధారణంగా మనము అనుకొనేది చెట్టువేసిన వాడు అనుభ వించక పోయినా తరువాత తరమువారు ఆ చెట్టు ఫలాలు అనుభ విస్తారని. కాబట్టి మనము ఇప్పుడు ఈ కల్ప వృక్షాలు నాటే వనమ హోత్సవము బ్రహ్మాండంగా జరిపించి ఆ చెట్లను జాగ్రత్తగా పోషిం చితే మన తరువాత తరమువారు ఆ ఫలాలను అనుభవించ గలరు. మన జీవితాలలో సగము, ముప్పాతిక చెల్లి పోయింది. మిగిలినది ఎలాగో ఒకలా జరిపేద్దాము. మన పై తరమువారికి భోజనసమస్యే వుండదనే తృప్తే మనకు సగంబలము సగం ఆహారము ఈ కల్ప వృక్షాలు నాటితే ఆ ఫలాలవల్ల భోజనసమస్య తేలుతుందా అపనమ్మ కపు రాముళ్ళు (Doubting Thomases) వుంటే వారికిదే ఋజువు.

మొన్న కవిరాజ ప్రతాపసింగు కురుక్షేత్రములో ఈ గ్రిస్తికా ఫలాన్ని ఆయుర్వేద ప్రదర్శనములో ప్రదర్శించారు. దాని రుచి బం గాళాదుంప వలెవుంది. ఆ పండు ఒక్కటితింటె మళ్ళీ రెండు నెలల వరకు భోజనము అవసరములేదు. ఎంతహాయి! ఎంతహాయి! పూర్వము సాధువులు, ఋషులు తపస్సు చేశారని, అడవులలో వన

మూలములు తింటూ మహామహా పనులు చేశారని మనము పూర్వపు గ్రంథాలలో చదివి- భలే కోతలు లేక సొరకాయ కోతలు కోస్తున్నారని అనుకొన్నాము. కాని వాళ్ళు గ్రిస్తికా ఫలాన్ని తినివుంటారని అనుకోలేదు. కాబట్టి ఈసారి ఎప్పుడైనా ఆపాత పురాణాలు చదివేటప్పుడు ఆ మహాఋషులు గ్రిస్తిక ఫలాన్ని తింటూ వుండే వారని జ్ఞాపక ముంచుకోండి.

ఈ చెట్టు ఆల్మోరా జిల్లాలో ఎక్కువగా పెరుగుతుంది. పూర్వము ఋషి పుంగవులెందరో మన దక్షిణ దేశములో పర్వతాలన్నీ వదలి హిమాలయకు వెళ్లుటకు అదేనేమో కారణము. ఇది మరి దక్షిణాదిని పెరిగేదీ లేనిదీ చెట్టునాటి చూడాలి. ఇక్కడ పెరగకపోతే చెలో ఢిల్లీ (సుల్తాను పట్టుకుపోతాను కాదు) గ్రిస్తిక తెస్తానని మూటాముళ్లే సర్దుకుని బయలుదేర వలసివుంటుంది. ఒక్కొక్క చెట్టు ఒక్కొక్కసారి ఐదుమణుగుల ఫలములు వరకు ఇస్తుందట. మనదేశములో చెట్లను నాటిచూద్దాము.

సోదరీ మణులకు ప్రత్యేక విజ్ఞప్తి : చూడండీ! సోదరీమణులారా! ఈ కల్పవృక్షాలతో మన అదృష్టదేవత సాక్షాత్కరిస్తుంది. వంటయింండ్లలో మగ్గే అవసరమూ, వంట వాండ్ల గొడవా వుండదు. వేసే విస్తరి, తీసే విస్తరి వుండదు. మిత్రుల ఇంటి కెళ్ళినా. వారు మన ఇంటికి వచ్చినా ఫలహారాల సందడి వుండదు చుట్టాలని ఇదివరకంత నిరాదరణ సేయక అప్యాయంగా అహ్వానించవచ్చు. దేశ సంచారము చేయడానికి భయపడ నక్కరలేదు. పండుగ పనులుండవు. పెండింండ్లలో తొక్కిసలాట వుండదు. ఎంతహాయి! ఏంతహాయి! ఆఫీసుల్లో వుద్యోగాలు చేసే సోదరీమణులు ఆదరా బాదరా వుడ

కెయ్య నక్కరలేదు. అసలు ఆఫీసులకు వెళ్ళనక్కరలేదు హాయిగా ఇంట్లో కూచుని పచ్చీసో గవ్వలో ఆడుకోవచ్చు. కాలు కుదిరి ఇంటిలో వుండనంటే ఏ బెడదా లేకుండా ప్రపంచమంతా విహరించవచ్చు. సినిమాకు వెళ్ళుతూ హడావిడిగా కుంపటిమీద బియ్యము కడిగిపెట్ట నక్కరలేదు.

అదిగాక ఇప్పుడు తిండిగింజలు పండించు పొలాలన్నీ ఇక మీదట తిండిగింజలు పండించ నక్కరలేదు. రైతులు పొగాకు పసుపు వేరుసెనగ, ప్రత్తి వగైరాలు పండించి డబ్బు ఎక్కువ సంపాదించు కుని హాయిగా బ్రతకవచ్చు.

బ్రహ్మచారులకు, భార్యా వియోగులకు మరీహాయి, రాజకీయ వేత్తలు, శాస్త్ర పరిశోధకులు నిర్విరామంగా వారి వారి పనులు సాగించవచ్చు. సంసారి దుఃఖి సన్యాసి సుఖి అనే మాటలు త్రిప్పి వ్రాయవచ్చు.

అంతా బాగుంది కాని ఒక్కటే చిక్కు. జిహ్వా నేమిచేయాలీ అని. అది వున్నదని మరచిపోవటము శ్రేయస్కరము. ఇకమీదట ఇండ్లలో వంటఇండ్లే లేకపోతే పొయ్యి. గిన్నెలు. గరిటెలు లేకపోతే బియ్యము, పప్పు వుప్పు. అంగళ్ళలోలేకపోతే తొందరగానే 'జిహ్వా' సంగతి మరచి పోవచ్చు.

అనుమానాలు వద్దు. అనుమానాలు ప్రాణ సంకటము. 

# లోకులు కాకులు

లోకులు కాకులంటారు ; అంటే కాకుల్లాగు అరుస్తారని కాబోలు. ఆ మాటకొస్తే అసలు కాకులే నయము. అయితే లోకులు కూడా కాకులవలె గొంతులు చేసుకొని అరుస్తూవుంటే మిగిలిన మనుష్యుల (అరవని మనుష్యులు)కు తప్పకుండా పిచ్చెత్తే అవకాశ మున్నది. కాకులరుస్తూ వుంటేనే పెద్ద చిరాకెత్తుతుంది - ఎంత ప్రశాంత మానసిక సహజ గుణముగల మానవునికైనా. ఈ కాకుల అరుపులు చూచారూ — ముందు చుట్టాల ఆగమనాన్ని తెలియ జేయును. కాని ఆ "కాకా" ధోరణి విన్న కొద్దీ అహింసా ధర్మా లన్నీ అడుగంటిపోయి తుపాకీపెట్టి కాల్చివేయ బుద్ధి వేస్తుంది. కాకి మీద బ్రహ్మాస్త్రమా ! అసలు ఎందుకోగాని ఆ "కాకా" ధ్వనిలో నుండి ఎంత అసహ్యామన్నా - ఎంతటి సహనాన్నయినా యిట్టే తృటిలో త్రోసివేస్తుంది. ఈ మధ్య "కాకా" అనే పాటతో కొం దరు ధర్మాత్ములు మన దుంప తెంచారు. ఆ పాట వినలేక చచ్చాము. అట్లాగే లోకులుకూడా అరుస్తారంటే అందులో సందేహమేముంది ?

సహజంగానే లోకులకు అరవటము జన్మహక్కు. కాని ఇప్పుడు ఎన్నికల రోజులలో అది పౌరసత్వపు హక్కుగాకూడా

పరిణామము పొందింది. అరవటము, పాటలు పాడటము, లెక్చర్లు దంచటము, కారు కూతలు కూయటము అన్నీ ఎన్నికల కార్య క్రమములోని విశిష్టమైన అంశాలు.

ఆంగ్లములో యుద్ధములోను, ప్రేమలోను ఏం చేసినా అంతా ధర్మమేననే లోకోక్తి వుంది. ఆ లోకోక్తిని మనవారు స్వాతంత్ర్య సిద్ధి అనంతరము ఎన్నికలలో తగు మార్పుతో (ఎన్నికల యుద్ధ ములోనని మార్చుకొని) బహుళ ప్రచారము చేయుచున్నారు. కాబట్టి ఎప్పుడూ లోకులు కాకులల్లే కూసినా మానినా ఎన్నికల సమయాల్లోనైనా కొందరు మహాశయులు "కూయక" తప్పదు. ఈ కూతల నిజానిజాలతో గాని, మర్యాద అమర్యాదలతోగాని ఆ కూసేవారికి ప్రసక్తి లేదు. ఉండ నవసరములేదు కూడాను - అప్పు డప్పుడు ఆ కూతలు చాలా వింతగాకూడ వుండవచ్చు. ఇదివరలో కనీ వినీ ఎరుగని సత్యాలు వారు బయటపెట్టుతూ వుంటారు. మరుగున బడ్డ కొన్ని విషయాలు 'డిస్కవర్' చేస్తూవుంటారు !!

ఈ మధ్య ఇటువంటి సత్యమే బయటపడ్డది. మన దేశ నాయకుడు, మన దేశ ప్రధాని, భారతీయుల ప్రియ రాజకీయ రథసారథి అయిన శ్రీ పండిత జవ్హారలాల్ నెహ్రూ యొక్క తాత ఎవరో, ఒక ప్రతిపక్ష ఓ రాజకీయవేత్త దీర్ఘపరిశోధన చేసిన ఎన్నికల ప్రచార కాలములో ప్రకటింపబడ్డది. ఇట్టి మహాదృష్టము ఒక్క నెహ్రూకే లభించగలదని మాత్రము మనము అపోహ పడ వక్కరలేదు. సమయానుకూలంగా అందరికీ కొన్ని కొన్ని నిగూఢ నికృష్ట సత్యాలు ఈ ఎన్నికల కాలములో అందింపబడుతవి. నెహ్రూ అయితే ఎన్నో దేశాల, మతాల, నాగరికతల చరిత్రలు

చదివి ఆకళింపు చేసుకోగలిగాడు గాని ఆయన స్వంత కుటుంబ చరిత్ర ఇన్నాళ్ళవరకు తెలుసుకోలేని పరిస్థితులలో వుండిపోయి వుండగా, వారి రాజకీయ ప్రతిపక్ష నాయకుడొకడు ఎంతో శ్రమపడి నెహ్రూగారికి ఆ విచారము, ఆ అజ్ఞానము లేకుండ చేశారు. నెహ్రూనన్నా తన తాతగారు ఒక చౌకీదారని తెలుసుకొని చాలా గర్వపడుతున్నట్లు అట్టి శుభవిషయములను తెలిపినవారికి కృతజ్ఞతాభివందనములను తెలుపుచున్నారు.

కాని ఇంత కష్టపడి పరిశోధన చేసిన ప్రతిపక్ష రాజకీయ నాయకుడు ఈ కృతజ్ఞతాభివందనములు కాంక్షించేనా ఇంత కష్ట పడినది ? కాదు ఏదో తనకు పెద్ద లాభమే ముట్టగలదని ఆశించినా ఆయనకు దక్కినదంతే - వట్టి కృతజ్ఞతాభి వందనాలే ! పాపము !!

ఆటలోనైనా పాటలోనైనా కొన్ని నియమాలు పద్ధతులు ఉండాలి. ఆ పద్ధతులు హద్దులు దాటితే అవి అర్థము లేనివిగా పరిణమిస్తవి. ఒక్కొక్కసారి హేయముగాను, అసహ్యముగాను రూపొందగలవు. అట్లాగే రాజకీయాలలోని హద్దులుమీరి రాజకీయ వేత్తలు ఎన్నికల ప్రచారాలలో ప్రసంగించినా అవి అసహ్యముగానే పరిణామము పొందుతవి. అవి సత్యానికి ఎంత దూరమైతే ఆ వ్యక్తిని అంత లోతు అధఃపాతాళానికి త్రొక్కివేసే ప్రమాద మున్నది. మొన్న నెహ్రూని అన్న వారేగాక మన రాజకీయాలలో ఇప్పుడు ఇట్లా గౌరవ మర్యాదలుగల స్థానములలోనున్న అనేక మంది వంశ చరిత్రలను ఈ విధంగానే పరిశీలిస్తున్న రాజకీయ వేత్త లున్నారు. ఈ రాజకీయ వేత్తలకు ధరావతులు పోయే ప్రమాదము లేదు గనుక, విభిన్నరీతుల తమ తీవ్ర పరిశోధనలు గావించి పెక్కు

కట్టుకథలకు బహుళ ప్రచారము కలిగించి ఆ వున్నత స్థానములో నున్న వారికి ఆశ్చర్యము, వినోదము, అనుకోకుండా కలిగించు తున్నారు. వీరి ఋణము వారు ఎప్పుడు తీర్చుకోగలరో ?

కాని కాకులవలె కూసే ఈ లోకులకు ఇట్టి ప్రచారమువల్ల కలిగే లాభమేమిటి ?

సున్నకు సున్న - హాళ్ళికి హాళ్ళి. వీరి అసత్య ప్రచారములు నమ్మెదెవరు. ప్రపంచమంతా వీరనుకుంటున్నంత బుద్ధిహీనులు కారు. వీరికి లేకపోయినా యితరులకు యుక్తాయుక్త జ్ఞానములు పూర్తిగా నశించలేదని వీరు ఎంత తొందరగా తెలుసుకుంటే అంత మంచిది. నిజమెప్పుడు నిలకడమీదగాని తెలియదు. సత్యానికి జయము తప్పదు.

రాజకీయవేత్తలు వారి ప్రతికక్షుల రాజకీయాలను విమర్శించు కొనవలయునుగాని తాతముత్తాతల చరిత్రలతో ప్రమేయమేల ?

ఇట్టి దుష్ప్రచారమునకు అసూయ అని కొంచెము ఆత్మ పరిశోధన చేసుకుంటే తెలుతుంది. ఈ అసూయని వదిలించుకోలేని మానవుడు మానవుడుకాదు. రెండుకాళ్ళ పశువే. 'కాకా' అని కూసే కాకి ఎన్నో రెట్లు మేలు. కారు కూతలు కూస్తూ జీవించే కన్నా నరాధములు ప్రాణ త్యాగములు చేసుకొనటము ఉత్తమము. లేదా దైవమే వారికెప్పుడో శృంగ భంగము కల్పించి పాఠము నేర్పించకపోదు.



## రాణీ రుద్రమ భర్త ... !

"ఏం ఇలావచ్చావు?" అన్నాను దడబడలాడుతూ వచ్చిన నెచ్చెలి జానకితో,

"కొంపముంచావు" అని కూలబడ్డది కుర్చీలో.

"కొంప ముంచానా?" అని తెల్లబోయి సంభాళించుకొని "అది మాకు అలవాటు లేదే" అన్నాను దర్జాగా.

"నీకది అలవాటో పొరపాటో నాకది గ్రహపాటైంది"

"అసలు సంగతి చెప్పకుండా ఏమిటి మేళాము"న్నాను విసుగ్గా

"రోలొచ్చి డోలుతో చెప్పకుంటే మేళాముకాదూ"

"అవుతుందనే అనుకోవాలి"

"నీకేమి నాకు ప్రాణ సంకటము. నీకు పరిహాసము."

"ప్రాణ సంకటాలన్నీ పరిహాసముచేసి కష్టాలన్నీ సుఖాలుగా మార్చబోవటమే మాఅలవాట"న్నాను ఏకచ్ఛత్రాధిపతి దర్జాతో.

"అసలదే నీకున్నరోగము" అన్నది బుంగమూతి పెట్టుతూ జానకి.

"అమ్మాయి! మాటలు జాగ్రత్తగా రానీయి. రోగము, గిగము అన్నావంటేచూడు" దగ్గిరేవున్న టెన్నిసురెకెటు ఎత్తబోయి,

చేతులోవున్న చేతిగుడ్డ జానకి ముఖముమీద వేసి నేను తాపీగా కుర్చీలో కూర్చుని ఈ నెల సంపాదకీయము వ్రాసు కుంటున్నాను. నాకు సాధారణంగా కోపము, ఏ ఎడాదికో రెండుసార్లు వస్తుంది. వస్తే మాత్రము ఆరునెల్లకు గానిపోదు. ఇప్పుడట్టిదే వచ్చినదని పసి గట్టి గాబోలు జానకి సవినయంగా, మృదు మధుర హావభావాలతో.

"అయితే చెప్పుతా నుండు" అన్నది.

"చెప్పకపోతే పో" అన్నాను.

"చెప్పుతానంటే చెప్పకపోతే పో అంటావేమిటి"

"సరే నీ యిష్టము"

"నేను, మా ఆయన పోట్లాడు కున్నాము"

"మంచిపని చేశావు"

"నీ కన్నీ వేళాకోళము"

"నాకన్నీ వేళాకోళముగాదు. ఎవరైనా ఒక పెళ్ళాము తన మొగుడుతో పోట్లాడుకుంటేగాని వైసీ వర్సా అయితేగాని అందరికి వేళాకోళమే"

"అయితే నేను దానికెట్లా బాధ్యురాలని?"

"నీ మొగుడ్నడుగు"

"నిన్నడుగుదామని వస్తే"

"వస్తే వెళ్ళు"

"వచ్చానా! అడిగ్గాని వెళ్ళను"

"అడిగావుగా మరి వెళ్లు"

"అసల్ది అడగందే"

"ఇప్పుడిదంతా కొసరుదేనా? కానియ్యి అసలు దేమిటో"

"అసలు మా యిద్దరి మధ్యా పోట్లాటకి నీవే కారణము" గదిమూల చీపురుకట్టగాని, రోకలిగాని వున్నదానిచూచాను. ఈ దినము జానకికి పోట్లాడుకునే యోగమేగాని, దెబ్బలుతినే యోగము లేదేమో రెండూ కనబడలేదు.

"అసలు నీ మొగుడు ఎల్లాటి వాడో ఏ నాడు చూడలేదు. మీపోట్లాటలకు నేను కారణమేమిటి" అన్నాను ఉధృతంగా కుర్చీలో నుంచి నిలబడి. వ్రాస్తున్న కాగితాన్ని చింపిన ఆవేశ భావాన్ని గ్రహించి జానకి జాగ్రత్తగా నే నసిగింది.

"అదిగో ఆ వ్రాతలే కారణము"

"నేను వ్రాసుకుంటే మీ ఆయనకేమి వొచ్చిందోయి"

"నేను నీకేదో చెప్పి వ్రాయించానని ఆయన ఉద్దేశము"

"అంతే నీవంటి తెలివిగల భార్యామణులు మాకు చెప్పక పోతే వ్రాయలేమనా ఆయన ఉద్దేశము?"

"అదికాదు, నీవు నేను స్నేహితులమా"

"అయితే, ఏం? ఆయనకది ప్రాణాంతకంగా వుందా"?

"ఉ, అదేమరి."

"అయితే మానెయ్యి"

"మానేస్తాలే. మొన్న .... పత్రికలో వ్రాశావే భార్యలు భర్తలవద్ద కారు డ్రయివింగు నేర్చుకో వద్దని. అదేమో మా అయన చదివి నామీద దూర్వాసమునెల్లే లేచారు. నేను నీతో ఆయన కారు డ్రయివింగు నేర్పేటప్పుడు పడ్డ అగచాట్లన్నీ చెప్పానట. నీవేమో

అవన్నీ పత్రికకు ఎక్కించావట. తనకది చాలా అప్రతిష్ట. నన్నెందుకు చెప్పావని నానా మాటలు అన్నారు"

"అయితే నీవునాతో చెప్పావా ఆ సంగతులు లన్నీ?"

"నే నెప్పుడు చెప్పాను?"

"మరాసంగతి ఆయనకు చెప్పలేకపోయావు?"

"చెప్పితే నమ్మితేగా?"

"అసలీ జాతికున్న రోగమే అది. రహస్యాననివి, కవిగాంచు నన్నది మీ ఆయనకు తెలియకపోతే నీవుచెప్పు. గుమ్మడికాయల దొంగెవడురా అంటే బుజాలు తడువుకున్నాడట వెనకటికి ఒకడు. లోకంలో నీవు. నీ భర్తలాంటి సతీపతులు ఏకైకదంపతులు! అందరూ మనలాంటివాళ్ళే, అందరికీ మనలాంటిసమస్యలే. అందరము మనుష్య మాత్రులమే మానవ నైజము అంతా "అంతే"

"క్రిందటిసారి బావమరదుల సంగతి వ్రాసావు. ఈసారి కారు డ్రయివింగు సంగతి వ్రాసావు రెండు మా ఆయన్ని గురించి నేను నీకుచెప్తే నీవు వ్రాస్తున్నావని ఆయన భ్రమ"

"నీవు నాకు చెప్పలేదు. మీ ఆయన సంగతి వ్రాయలేదు. దీన్నిబట్టి తేలిందేమిటంటే, ఈ నారచనలు సహజంగా వున్న వన్న మాట, ఆ క్రెడిటు మీ ఆయన నాకు ఇండయిరెక్టుగా ఇచ్చినందుకు కృతజ్ఞురాలను. కాని ఇప్పుడు నీ వ్యవహారానికి నే చెప్పదలచు కొన్నది ఒక్కటే మాట. ఇంటింటా ఒకపొయ్యి మనింట్లో ఒక పొయ్యి. కాబట్టి గుమ్మడికాయల దొంగెరవంటే బుజాలు తడువుకో వద్దని నీ ప్రాణనాథుడ్ని వేడుకో"

"ఆ ఈ మాటలు నేనెంత సరసంగా చెప్పినా అవి విరసము గానే మారుతవి"

"అది నీ ఖర్మ"

"సరే ఖర్మను ఏం చేస్తాము...." ఆ మనఖర్మ వంద్యమేకదా నాకేదిదారి, నన్ను రెట్టించి రెట్టించి ఇంటి గుట్టు బయట పెట్టానని అంటుంటే...." కళ్ళనీళ్ళ పర్యంతమై దీనంగా అడిగింది.

"గోదారే"

"అదికాదు లక్ష్మి, నేను చెప్పినవేవీ ఆయన నమ్మటములేదు. నా విషయము- మన విషయము ఆమెతో నీవెందుకు చెప్పావు అని రెట్టించి రెట్టించి అడిగితే నేనేమి చెప్పేది. నీవు వ్రాసేవన్నీ నేను చెప్పేమాటలని ఆధారము చేసుకునేనని ఆయన అనుమానము"

"అయితే మాయింటికి నీవసలు రావద్దు, నా నేస్తము మానెయ్యి. అది ఉభయులకు మంచిది."

"నేను నీయింటికి రావటము లేదని చెప్పిన తరువాత నీవు ఇట్లాంటి కథో, వ్యాసమో ఏదో వ్రాస్తే అప్పుడు మళ్ళీనేను నీకు రహస్యంగా చెప్పానని అనరూ"

"బాగుంది వరస. అసలు అనుమానాలుంటే అవి పెనుభూతాలై కూర్చుంటవి. జీవిత సమస్యలను గురించి వ్రాసేటప్పుడు. ఏ కవైనా రచయితైయినా దేన్నిగురించి వ్రాస్తారు? నిత్యజీవితములో ఎక్కువ చిక్కులతో నిండుకున్న రమ్యమైనకథావస్తువు దాంపత్యము ఆ తరువాత అత్త కోడళ్ళ జగడాలు అల్లుళ్ళ అలకలు. పిల్లల చిలిపి

తనాలు, కాబట్టి పత్రికలలో వ్రాసే కథలలో పాత్రలన్నీ తామే నను కొని అపోహపడి, ఒంటికాలుమీద కయ్యానికి లేవటమేమి సబబు?"

"పాపమాయన నిన్నేమి అనలేదులే."

"అబ్బ ఎంత జాలిగలదానవు. పాపము అయన్నేమి మనము అనలేదులే"

"నీ వన్నావని కాదు. నీవు మనస్సు నొచ్చుకుంటున్నా వని అన్నాను కాని"

"ఇదిగో, కానీలేదు, ఏమ్మిడిలేదు. నాకు నీవన్నా ఏమి భయములేదు. నీ మొగుడన్నా దిగులులేదు. మనము స్కూల్లో డిబటులో కత్తా కలమా వాదోపవాదాలు చేసుకున్నాము జ్ఞాపకముందా నేను నా జీవితములో సాధించగలిగింది ఈ కలముతోనే సాధించ దల చాను. ఈ కలము అసత్యము వ్రాయదు. నాకింక భయమేమున్నది. ఎవరో కష్టపడతారని మానుకుంటానా? నే వ్రాసిన వాటిలో అధర్మ ముగాని అసత్యముగాని అశ్లీలముగాని లేదు కదా ! ఏమంటావు"?

"లేదనుకో. కాని ఎప్పుడూ మగవారి మీదకుదాడి తీస్తుంటే వారందరూ నీకు శత్రువులే అవుతారుగా"

"అదా నీ భయము. నాకదేమి భయములేదు. శత్రువులై ఏమి చేస్తారు నన్ను? ధర్మము ఎక్కడుంటే అక్కడ జయము తప్పదు."

"అయితే నేను వెళ్ళుతా. నాకేదో ఉపాయము చెప్పు"

"ఇదిగో నా సలహా ఇందాకే చెప్పాను. ఉపాయాలు గిపా యాలు ఎరిగిన దానను కాదు. అనదలచు కున్నది, చెప్పదలచుకున్నది కుండ పగలేసినట్లు అనటమూ, చెయ్యటమే నావంతు"

"అయితే మరి..."

"చూడు ఈ చిక్కు నీకొక్కదానికే వచ్చిపడ్డదేమి కాదు. మన జాతికి ఏ నాటినుంచో వున్నరోగమే అది. అలనాడు రాణీ రుద్రమకు తప్పలేదు ఈ గొడవ ఈవేళ ఇంటిగుట్టు ఎందుకు రైట పెట్టావని రెట్టించితే రేపు రెట్టించటానికి ఇంకొకటేదో దొరకకపోదు అథవా ఆతీరు తప్పితే అసలు ఇంటి సంగతి, ఇల్లాలు సంగతి పట్టించుకోకుండా వుండడను మన ఆంధ్రుల ప్రత్యేక లక్షణము. ఈ లక్షణాలు వాటంతటవేమి చెడ్డవి కాకపోయినా ఆంధ్రమహిళలకు ప్రాణ సంకటముగానే తయారవుతున్నవి"

"అంతేలే నీవు చెప్పినట్లు రాణీ రుద్రమకే తప్పనివి మన కెక్కడ తప్పుతవి?"

"మరి వెళ్ళొస్తావా"

"ఆ చాలా సేపయిందినేనొచ్చి. మావారు ఆఫీసు నుంచి వచ్చే టైమ్ అయింది, వెళ్లొస్తా"

"నీవు మాయింటికి రావటము మానేస్తే మరీ మంచిది"

"ప్రయత్నము చేస్తా. అది అంతసులభంగా సాధ్యమయ్యే పని కాదు"

"అమ్మయ్య" అనుకుని పడక కుర్చీలోకి వాలాను.

రుద్రమ్మ భుజశక్తి...." అని చెవులో గింగురు మన్నవి.



# నెరజాణల వ్యాపారాలు - వృత్తులు

దేశ చట్టము ప్రకారము స్త్రీలు ఏ వృత్తులకూ అనర్హులుకారు. పురుషులతోపాటు ఏ వ్యాపారముగాని, ఏ వృత్తిగాని నిర్వహింపవచ్చును. జీవనోపాధికి ఏ వ్యాపారము, ఏ వృత్తి ప్రజలు అవలంభించినా అది జన్మ హక్కు (ఫండమెంటల్ రైట్స్). దేశములో ఒక్క వృత్తిలో మాత్రము స్త్రీ పురుషుల తారతమ్యము లేకుండా ఒక వృత్తిని సాగిస్తున్నారు ప్రభుత్వము దీనిని ఇమ్మోరల్ ట్రాఫిక్ యాక్టుతో నిర్మూలనము చేయదలచింది. అందుకనే ఈవృత్తి వ్యాపారము సాగిస్తున్న స్త్రీలు పార్లమెంటు భవనములందు సమ్మెచేశారు. వారి జీవనోపాధి నిర్మూలిస్తే ప్రభుత్వము వేరే దారి చూపించవద్దూ?

చట్టములతో ఈ వ్యభిచార మహమ్మారిని ప్రభుత్వము నిర్మూలించాలనుకోటము వట్టి భ్రమ. ఈ చట్టము వల్లగాని వ్యభిచరించుచున్న స్త్రీ పురుషులమ శిక్షించుటవల్లగాని ఈ వ్యభిచార మహారోగాన్ని వదలించలేరు. చట్టములతో మద్య నిషేదము ప్రభుత్వము కొనసాగించ గలగిందా? అట్లాగే చట్టములతో వ్యభిచారము నిర్మూలించుటా అసంభవము-

వ్యభిచార వ్యాపారాన్ని కొందరు స్త్రీలు ఎందుకు సాగిస్తున్నారు? 'వారందరూ పొట్టకూటికే సాగిస్తున్నామని వారే ఏక

గ్రీవంగా చెప్పుతున్నారు. వారితో వ్యభిచరించుచున్న పురుషులెందుకు వ్యభిచరించు చున్నారు? దానిలో వారికి వచ్చే లాభముగాని ఆనంద ముగాని, సౌఖ్యముగాని లేదు. అయినావారు వ్యభిచరించుచున్నారు కారణము మతి మాలి అవినీతి పరులగుటే. ఎప్పుడు వ్యభిచార వ్యాపారము సాగించే స్త్రీలుండరో అప్పుడే వ్యభిచిరించే పురుషులూ వుండదు.

స్త్రీలు వ్యభిచరించటము పొట్టకూటికను నది నిర్వివాంశము. కొందరు స్త్రీలు బహిరంగముగా మహాపట్టణాలలో అక్కడి సందుల్లో, ఇక్కడి గొందుల్లో ఈ వ్యభిచారాన్ని వ్యాపారముగా సాగిస్తున్నారు. ఆ స్థలాలనే డేంజరు జోను, ఎర్రదీపపు జోను అనే నామధేయములతో వ్యవహరింప బడుచున్నవి. ఈ ప్రదేశాలలో తిరిగే పురుషులు వెతుక్కుంటూ పాపానికి బయలుదేరుచున్నారు. ఇక్కడి వేశ్యలు ఆ విటుల సర్వస్వము హరించి బుద్ధి చెప్పుచున్నారు వీరినే ప్రభుత్వము చట్టములతో నిర్మూలింపనెంచినది. కాని వారు వారి రహస్య నీచ వ్యాపారాన్ని నిరభ్యంతముగా సాగించగలరు. నిజంగా ప్రభుత్వము వ్యభిచారము నిర్మూలించదలచితే ఈ స్త్రీలకు వేరే దారి మాపించాలి. వారికి మర్యాదగా సులభంగా జీవనము సాగించుటకు ఉపాధి కలిగించాలి.

కాని ఇట్టి వ్యాపారము బహిరంగముగా సాగిస్తున్న స్త్రీల కన్నా ఇంకో రకము నీతిమాలిన స్త్రీలు నిరాఘాటంగా వ్యభిచారము సాగిస్తున్నారు. వారు కులటలైనా కులాంగనలవలే తిరుగుచున్నారు. పయోముఖ విషకుంభములవలే గృహస్థుల ఇండ్లలో తిరుగుచూ. అనేక కాపరములకు చిచ్చు పెట్టుచున్నారు. తళుకు బెళుకు

వేషములతో అనేక పురుషులను మోసగించి వారి ధనమును అపహరించు చున్నారు. వారు ఇక్కడ అక్కడ, వీరు వారు అనే విచక్షణ లేకుండా, ట్రావెలర్సు బంగళాలలోను, బడి ప్రహారములలోను, సంఘసేవా సంస్థలలోను, రాజకీయ వేత్తల ఇండ్లలోను, మతసంస్కర్తల గృహాలలోను ఎంతో చాతుర్యముతో వారి వ్యాపారాన్ని సాగిస్తూ, వారి పొట్ట పోషణకొరకు ఎంతో ధనాన్ని సంపాదిస్తూ వున్నారు. ఈజాతి కులటలకు పొట్ట పోషణతో తృప్తి వుండదు. వీరు సంఘములో ఒక విచిత్ర స్థానము నలంకరించుటకు ప్రయత్నిస్తారు. ఇల్లు, వేషము, అట్టహాసము ధనవంతులవలె వుండవలయును. సంఘములో ఏదో ముఖ్యస్థానమో, కార్యమో సాధించుచున్నట్లు అగపడవలెను. దానికై వారు ఎన్నో అసత్యములు, అధర్మములు అవినీతి కార్యములు చేయుదురు. ఒక్కొక్కప్పుడు రంకుతనముతో పాటు దొంగతనము కూడ చేయవలసి యుండును. సాగినన్నాళ్ళు ఇట్టి వ్యాపారము సాగించి వీరు సహజముగా తరువాత ఏ దురవస్థ పాలగుదురు. వీరు నే మొదట జెప్పిన పడుపు వృత్తి సాగిస్తున్న స్త్రీల కన్నా సంఘానికి చాలఅపకారము చేయుచున్నారు. మొదటి రకము వారు వారి విటులకే హాని కలిగిస్తున్నారు. రెండవ రకము వారు సంఘానికి అపారమైన హాని కలిగిస్తున్నారు. ఇంకొక రకము ఆకుటుంబానికే హాని చేసేవారూ వున్నారు. ఈ రకము స్త్రీలు కేవలము ఆర్థికముగా నిస్సహాయులై, ధైర్యముగా ధర్మముగా ధనార్జన చేయలేక, ధనార్జన చేయవలసిన అగత్యము ఏ కారణము వల్లనో వారి పాలిటబడుటచే ఇట్టి అవినీతికి వడిగట్టి ధనార్జన చేయుటకు పాల్పడిన వారునూగలరు. ఈ మూడు జాతుల స్త్రీలలోను రెండవ జాతివారు సంఘానికి అపారమైన అనర్థము కలిగించు చున్నారు.

వీరి వేషభాషలను బట్టి వీరు వ్యభిచారిణులని నిర్ణయించుట కష్టము. వీరు ఎర ఎక్కడ ఎప్పుడు వేయుచున్నారో తెలియదు. వీరు జార్జటు, షిపాను చీరలు తప్ప కట్టరు. ఏడువారాల నగలు ధరిస్తారు. ఒక స్థానములోనే వుండరు. హడావిడిగా కార్లలో విమానములో దప్ప ప్రయాణము చేయరు. పంచభక్ష్య పరమాన్నములు దప్ప భుజించమని, హంసతూలికా తల్పములదప్ప నిదురింపమని చెప్పుకుంటారు. వారు చెప్పేదిఒకటి, చేసేది ఇంకొకటి, ఆలోచించేది మరియొకటి. అది ధనార్జన, ఆ ధనార్జన కొరకు ఎట్టి అవసర కార్యముగాని, దుర్మార్గముగాని, చేయ సాహసింతురు. వారు చేయలేనిది చేయరానిది అంటూ ఒకటి వుండదు. కాబట్టి వీరు తమ విటులకుచేసే హానే కాకుండా అనేక మందికి హాని కలిగిస్తారు, అమాయకుల నెందరినో వంచించుతారు, అపవాదులతో బాధిస్తారు. ఎందరి గౌరవ మర్యాదలనో హరించి, వారి ధనమును అపహరించ చూస్తారు. అనేక సంస్థలకు, పెద్ద మనుష్యులకు అపారమైన హాని చేస్తారు. దేశ గౌరవ మర్యాదలు మూవుమూపుతారు. వీరిని సంస్కరించేదెట్లా? అదే స్త్రీలకు సవాలు!

వారికీ ఏదో కొద్ది జీవనోపాధితో తృప్తి వుండదు. సాధారణ వీరు విద్యావిహీనులు. అవివేకులై వుంటారు. వీరికి విద్యాగంధము అతకదు, అప్పుడు వీరికి ఏదైనా వృత్తి విద్య నేర్పించుట అవరము. ఈ వృత్తివల్ల ఆర్జించే ధనము తమ ఇంద్రభోగమునకు సరిపోయే టట్లుగా వుండాలి. లేకపోతే వారు వారి నీచపడుపు వృత్తిని వదలుట కష్టమే.

మన దేశములో అట్టి ఇంద్రభోగము అనుభవించుటకు వలయు వృత్తులేవీ లేవు. అట్టి భోగము అనుభవించుటకు పదిమంది విటులను

చేరక తప్పదు. కావున వారికి నేర్పవలసినది నైతిక ధర్మములే. నైతికముగా వారు సంస్కారము పొందితే తప్ప వారికి వేరే దారిలేదు.

మొన్న మా సోదరి శ్రీమతి రా.......క్ష్మి పత్రికలలో ఒక కథ వ్రాస్తూ దేశములో పతివ్రత లున్నారా అని అడిగింది. లేకేమి అని చెప్పింది కూడాను. లేకేమి వుమ్మాటికి వున్నారని మేము సాహసించి చెప్పుచున్నాము.

కులట లెంతమంది వున్నారో పతివ్రతలు అంతమంది వున్నారు. వారుండబట్టే యింకా సూర్యచంద్రాదులు, ప్రకాశిస్తు న్నారు

అంతేకాదు, వారితోబాటు ఏక పత్నీవ్రతులైన శ్రీరామ చంద్రులు, ధర్మరాజులు, హరిశ్చంద్రులు. బలిచక్రవర్తులు అనేకమంది వున్నారు. చీకటుంటేనే వెలుతురు కనబడుతుంది. పాప ముంటేనే పుణ్యము కనబడుతుంది. పుణ్యాత్ములుంటేనే దుర్మార్గులు కనబడు తున్నారు.

కాని ఈ రోజులలో అన్నము, పానీయము, నిద్ర వలెనే సంభోగము కూడా ఒక సహజమైన కర్మ అనే వాదించే విపరీత వాదులు బయలుదేరినారు.

ఈ వాదము దుర్గతికే మూలము. అది కేవలము సంతానాని కేనని ఎప్పుడు మనసోదరీమణులు గ్రహిస్తారో ఆనాడు వ్యభిచారము దానంతటదే మటుమాయమగును. ప్రభుత్వము చేయలేనిది స్త్రీలు సాధించ గలుగుతారు.

శ్లో॥ నసంరాగోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం
విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః
మహద్భిః పుణ్యౌఘైశ్చిరపరిగృహీతాహి విషయాః
మహాన్తో జాయన్తే వ్యసనమివదాతుం విషయిణామ్॥

ఈ సత్యము స్త్రీలు గ్రహిస్తే వ్యభిచారము అంతరించటమే కాకుండా, సంతాన నిరోధ కేంద్రాల అవసరము లేకుండా చేయ కలరు.

వివేకులై దేశాన్ని రక్షించుకొనుట ప్రజల విధి.

మానాన్ని రక్షించుకొంటూ దేశాన్ని రక్షించుకొనుట స్త్రీలవిధి.



# ఆడబిడ్డలు - అధికారాలు

ఆడబిడ్డల అధికారములు ఆంధ్ర మహిళ లెరుగనివి కావు. తమ్ముడి పెళ్ళికోసము కనిపెట్టుకునుండే ఆడబడుచు లెంతమంది? వీరికి తమ్ముడొక ఇంటివాడవుతున్నాడనే సంబరముకన్న మరదలు మీద అధికారము చెలాయించాలన్న అభిలాష మెండు, క్రొత్త పెళ్ళి కూతురుకు భర్త ప్రాణవిభుడు.-ఆడబిడ్డ ప్రాణవిటత. ఆడబిడ్డల ప్రాముఖ్యత తమ్ముని పెండ్లితో ఆరంభము. ఆనాటివరకు అనామకులైనవారు సైతము చిత్రముగా బహు ప్రముఖ పాత్ర వహిస్తారు.

వధువు తలితండ్రులు ఆమెను మరువజాలరు. ప్రత్యేక మర్యాదలకు ఆమె అర్హురాలు. అసలామెకు ప్రత్యేక సత్కారము తప్పదు. ఆమెకు తనివి తీర లాంఛనములు జరుగవలసినదే. కొన్ని ప్రాంతములలో వరకట్నములతో పాటు ఆడుబిడ్డ కట్నముకూడ యున్నది. సంబరముతో తమ్ముని వివాహాము దగ్గిరయుండి చేయించును. ఆనందముతో మరదలును హేళనచేయును. వరుసపాటలు పాడి పిసిగించును. తలుపు దగ్గిర పేరు చెప్పమను నెపముతో లాంఛనములు పుచ్చుకొనును. హారతి బట్టి దానికితోడు ప్రతిఫలము వెంటనే సంపాదించును. అంతటితో తృప్తి పొందక మరునాడు కంకణ విసర్జనముందు తమ్మునీ మరదలనీ నిలవేసి "ఆవునిత్తునా

ఆడబిడ్డ నిత్తువా''ని అడుగును, ఆవునిత్తునులే అనబోయి ఏలనో ఆప్యాయముగా ఆడుబిడ్డనే నిత్తు మనుదురు నూత్నదంపతులు! తరువాత ఆడుబిడ్డ నివ్వకపోతే అగచాట్లు ఆ మరదలు ప్రాప్తములేక ఎక్కువ కట్నము వస్తుందని మరదలి నిర్బధించకపోతే మేనగోడలి అదృష్టము.

వివాహానంతరము అంతా సుఖంగా వున్నారు. కథ కంచికి మనమింటికి అని చెప్పుకోటము మామూలు. కాని కథ అక్కడే అడ్డము తిరిగేది. అసలు కథ వివాహానంతరము ఆరంభము (ముందు జరిగినది ఉపోద్ఘాతము) అప్పటినుండి ఆడబిడ్డలకు వేట ప్రదేశము పుట్టినిల్లు. గురి మరదలు. అందుకే పిండితో బొమ్మచేసి పెట్టినా అది అదిరదిరి పడుతుందని తెలుగు దేశములో సామెత. ఈ అదురు పాట్లన్నీ ఆంధ్ర లోకానికి సినీనటి సూర్యకాంతము ముచ్చటగా చిత్రసీమలో ఎన్నో రసవత్తర ఘంగుల ప్రదర్శించినది. అని అందరికీ చిరపరితములే.

ఈ ఆడుబిడ్డలు తమ్ముని సంసారములు చిన్నా భిన్నముచేసిన వారున్నారు. కొరగాని సంసారములను మూడు పువ్వులు ఆరు కాయల లలరారునట్లు చేసిన వారున్నారు. అవివేకి వయస్సున చిన్నదైన మరదలుకు తోడునీడై, గురువై, సోదరై జీవితమార్గము దిద్దిన యిల్లాండ్రును గలరు. ఆనాటి ఈ ఆడుబిడ్డల ప్రముఖ పాత్ర మన సాహిత్యములో చూడవచ్చును. సాహిత్యము నిత్య జీవనమును ప్రతిబింబించునదియే కదా? సాహిత్య సాగరములోని ఆడుబిడ్డల అణిముత్యాలను పరికిద్దాము.

అయోధ్యా పురాధీశ, కౌసల్యా కుమారుడు, శ్రీరామచంద్రుని

సోదరి శాంతను చూద్దాము. అందరి భార్యా భర్తలవలెనే శ్రీరామ చంద్రుడు సీతమ్మవారు కూడా అప్పుడప్పుడు తగవులాడుకునేవారట ఓరోజు అలాగే తగవులాడుకున్నారు. వైదేహి రామునిపై అలిగి ముసుగుతన్ని పడుకుంటే చిలుక "రఘురాము ఒంట్లోను లఘువు తప్పింది" అని శాంతమ్మ చెవిలో వూదినదట. అదేమి చోద్యమో గాని ఈ చిలుకలు ముందు ఆడుబిడ్డల చెవులలోనే ఇలాంటి వర్తమానాలు ముందు వూదుతవట

వెంటనే శాంతమ్మ తమ్ముని పడకటింటిలో ప్రవేసించి ఆయన ముసుగుతీసి చూచినదట. అలుక గృహమేగి జానకినిజూచి ఇద్దరినీ ఒక్కచోట చేర్చి పేచీ తీర్చిందట. దగ్గిరనుండి భోజనాలు పెట్టించిందట. తదనంతరము తాంబూరాలు వేసుకొంటూ శాంతమ్మ తగవు మరచి ఆనందము ముఖారవిందమున ప్రదర్శించుచున్న మరదలుని చూచి నవ్వుతూ "దృష్టితగులకుండాను నీలాలనివ్వాళ్ళు లివ్వరమ్మ" అని పరిహాసము చేసినదట.

మాటకారి సీతమ్మ "ఇంద్రాది చంద్రాది మించేటి చంద్రులు మీ తమ్ములూ దృష్టి తగలకుండా వారికే నివ్వాళ్ళు లిమ్మన్నా"దట.

శాంతమ్మ వూరుకోకుండా "అక్క చెల్లెంద్రు మీదు మిక్కిలి సౌందర్య శాలురమ్మ. మా తమ్ముల నలుగురినీ వలపించు జాణలకు దృష్టి తగులూ" అన్నది. జానకికాక ఇంకో మరదలెవరైనా అయితే మూతిమూడు తిప్పులు తిప్పి వంటింట్లోకి వెళ్ళి గిన్నెలు దడబిడ పగ తేసేదే. కాని సీతమ్మ వూరుకుంటుందా! "మాయన్న ఋష్యశృంగుని వనములో నుండి తాయకున్నా, యేమి ఎరుగని తపసినీ ఓ వదిన

కేళించి విడచినావూ" అన్నది. దానితో ముద్దు మొట్టికాయ తిన్న శాంతమ్మ వూరుకోవలసి వచ్చింది.

ఇంత సౌమ్యంగా, చమత్కారంగా తగవులుతీర్చే శాంతమ్మ లింటవుంటే అతివమగలకు తగవులేల వుండును?

బృహస్పతి యిచ్చిన లగ్నమున అగ్ని యమవరుణ వాయు ధనదాది సురవరులు నత్రి భృగునారద వశిష్ఠ వాసుదేవ ప్రభృతి మహామునులును సదస్యులుగా కశ్యప ప్రజాపతి హోమకర్తగా, అరుంధతియు శచియు, సత్యభామయు రుక్మిణియు నప్సరోగణంబులు పురంధ్రి కార్యంబులు చేసేయ సుభద్ర అర్జునుని వివాహము అతి రమ్యముగా చేసుకొని యింద్రప్రస్థపురమునకు భర్తతో

"అనిరళ .........గజసహస్రంబును. గనకరత్న

రజితమై.................................

.......రాశార్హవరుల నరణమిచ్చె వామనుండు"

కృష్ణుడిచ్చిన అరణముతో సహా బయలుదేరింది. అక్కడ కుంతీదేవి, ద్రౌపదుల దీవెనలు బడసింది. కొంతకాలానికి పాండవ వంశకర్తయైన అభిమన్యుడు వైద్యవిభుండు, అనన్యసామాన్య పరాక్రమ ప్రభలమన్యుండు. పుణ్యచరిత్రుడు. అన్యరాజన్య భయంకరుడు. రణ శౌర్యుడైన సుపుత్రుని గనినది. ఆ తరువాత పుట్టింటినుండి తాను దెచ్చుకొన వలసినవన్ని దెచ్చుకొనలేదని జ్ఞాపకము వచ్చి పుట్టింటికి వెళ్ళింది. ప్రపంచాన్ని జయించగల పార్థుడు తను కోరినవన్నీ ఇవ్వ లేడా? కాని ఏ స్త్రీ పుట్టినింటినుండి దెచ్చుకొన నభిలషించదు. అల్లే సుభద్ర తను వచ్చిన కార్యము వదినలకు దెలుపగా రుక్మిణి సుభద్రకు ఇవ్వవలసిన అరణమంతయూ యిచ్చి పంపినదట. అయితే రుక్మిణి

జనార్దునునకు చెప్పిందో లేదో, సత్యభామ వప్పుకుందో లేదో మనకు తెలియదు. మొత్తానికి సుభద్ర తలకు కావలసినవి తెచ్చుకున్నది. అలాంటి ఆడుబిడ్డలు ఈ నాడూ వున్నారు. తమ భర్తల కెంతవున్నా వారికి పుట్టింటినుండి తీసుకొని వెళ్ళందేతృప్తి లేదు. [ఆస్తి హక్కుతో ఈ సరదాకు మంగళ హారతులేమొ] కలవారింటి ఆడబడుచులు జీవితాంతము వరకూ తీసుకొని వెళ్ళుతున్నా ఫరవాలేదుగాని, లేని వారికిది ప్రాణసంకటము.

ఒకప్పుడు సత్యభామ కమలదళాక్షుని 'వశగతుని' చేసుకొనన భిలషించి వదినె ద్రౌపతివద్దకు వెళ్ళి "నీ దెసపతులకు గించరపాటు లేదు, యొక్కడొక్కనికంటె నుభిద నీ కేవురు ననురక్తులగుట యద్భుతము, నీవొక భంగిన వదలక చెలువ యెభంగి భజింతురు?" అని ఆశ్చర్యము చూపి ఏ వ్రతము ఏ మంత్రము ఏ తంత్రము చేసి తన భర్తలను అనుకూలతను చేసుకున్నదో తనకు తెలుపమని ప్రాధేయ పడింది. మరదలుతో తమ్ముడనుకూలుడుగా వుంటే వదిన మరదలు మంత్రమో తంత్రమో ప్రయోగించిదను కుంటుంది. తను భర్తతో అనుకూలవతియై వుంటేనూ, మరదలు అట్లాగే అనుకుంటుంది. కాని మరదలు అనుకున్నమాట మనస్సులోనే వుంచుకుంటుంటి. వదినె ఆడబడుచూ అయితే ధీమాగా అంటుంది. సత్యభామ సత్యభామ గనుక తీరుగా వదినను అడగ వెళ్ళింది. దానికి ద్రౌపది వూరుకో లేదు. కోపము కూడా వచ్చింది.

"పురుషోత్తముని వనితవు గాదగవు. నన్ను
దుష్టవనితా జనము లట్లుగా దలంప జనునె?"

యని ముద్దుగా మందలించి మంత్రతంత్రాలతో భర్తల అనురాగము బడయుటకు ప్రయత్నము చేయుట బేలతనంబని చెప్పి కపట కర్మం

బుల పతులని గెలవ జాలరని చెప్పి, భక్తితో తాను చేయు పనుల విధానము సత్యభామ కెరింగించినది. అప్పుడు సత్యభామ "నానేరము సైపవలయు"నని క్షమాపణ కోరి 'సతుల చరితలతిదుష్కరములన్న' సంగతి ద్రౌపతి వల్ల తెలుసుకొని ద్వారకా పురమునకు వెళ్ళినది. అల్లాగేఈ రోజులలోను మరదళ్ళకు సౌభాగ్య మూలములైన విధుల తెలియజెప్పు ఆడపడుచులు లేక పోలేదు. కాని వారు ఆ చెప్పేది ఎంత సౌమ్యంగా చెప్పేది. అది స్వానుభవమా అన్నది మాత్రము అనుమానము.

నిగమశర్మ అక్క ఆంధ్ర మహిళలకు సుపరిచితురాలు. నిగమ శర్మ అక్కకు పేరులేదు. ఆమె ఆంధ్రులయింటి ఆడబడుచు. తమ్ముని సుఖము, మరదలి సౌభాగ్యము పుట్టింటి గౌరవము కొరకు సతతము కృషిచేయు నిర్మలజీవి.

నిగమశర్మ తర తరాలనుండి కూడపెట్టిన ధనమును దుర్వినియోగము చేస్తూ అప్పులపాలై రంభవంటి భార్యను త్యజించి ఊర్వశి వంటి వగలాడి మాయలో తగుల్కొని వృద్ధులైన తలిదండ్రులను, గుణవతైన భార్యను వదలి వారకాంత పంచ నీతిమాలి, సిగ్గు విడచి బ్రతుకుచుండగా నిగమశర్మ సోదరి సోదరుని దుశ్శీలత నెరింగి అత్త గారింటనుంచి పనిగట్టుకొని తనభర్తతో పిల్లలతో పుట్టినింటికి బయలు చేరింది. ఏ సోదరి తన సోదరుడు చెడిపోతూవుంటే చూచి వూరు కొనగలదు. తన సోదరుడు ఇంద్రభోగము అనుభవించాలనే ప్రతి సోదరి కోరుకుంటుంది. స్వార్ధపరురాలయిన సోదరి ఎక్కడైన నూటికి కోటికి ఒకరుండి రాక్షసివలె సోదరుని దుష్ప్రవర్తనలకు అనుకూలవతియై. మరదలు మీద లేనిపోని కసిదీర్చుకొని, తమ్ముని

మరింత మాయలో వేసి ధనము అపహరించువారు నేడు వనితాలోక ములో లేకపోలేదు. చివరకు వారు చూచేది మరదలి కన్నీరు కాదు. తమ్ముని దౌర్భాగ్యము కాదు. కాని తమ దుర్మార్గ దుఃఖ ఫలితము.

నిగమశర్మ అక్క పుట్టినింటికి వచ్చి కళావిహీనమైన ఇంటిని సర్ది, తలిదండ్రులను ఓదార్చింది, మరదలు కన్నీరు తుడిచి ముందు చేయవలసిన పని యాలోచించింది. తరువాత తమ్ముని సామదాన దండోపాయములతో బాగుచేయ ప్రయత్నించింది. వారకాంతల సీడమని బ్రతిమాలింది. నీకు కావాలంటే "హరికౌస్తుభమైన దెచ్చెద నని" చెప్పింది. ఏమైతేనేమి తన ధర్మము తను నెరవేర్చుకుంది. నిగ గమశర్మ బూజుపట్టి వున్న పుస్తకాలు తీసి మరల చదువనారంభిం చాడు. నిత్యాగ్నిహోత్ర నిర్వహణ, అతిథి సమారాధన, దానధర్మ ఆచరణ మొదలైన గార్హస్థ్య ధర్మాచరణములో లీనమైనాడు. అక్క సంతోషించింది. తలిదండ్రులు ఆనందబాష్పలతో కనులు చెమ్మగిలివి. మదరల చిరునవ్వులో కృతజ్ఞత కనుపించింది. కాని నిగమశర్మ తేనె బూసిన కత్తివలె సమయము కొరకు వేచియున్నాడు. "రుచింతురే కులసతులు వారాంగనభోక్తకున్"? అక్క ముక్కెరతోపాటు నగ లన్నీ తస్కరించుకొని వేశ్యావాకిట చేరినాడు. తరువాత వానికి తగినశాస్తి దైవమే చేసినాడు.

ఇక్కడ మనకు ప్రస్తుతము కావలసినది ఆడుబిడ్డ ప్రవర్తనయే కదా? అమె ఆమె ధర్మమును నిర్వహించింద. తన ప్రయత్నములు విఫలమైనవి. తన తమ్ముని పాపము పరాకాష్ఠనందుకొన్నది. తాను ఏమిచెయ్యగలదు? ఏమి చెయ్యకుండా వుండగలదు? చేతనైంది చేసి చూచింది. తన చెయ్యి దాటిపోయింది వ్యవహారము. తన బాదా

ర్యము, తన సంస్కారము, తన సోదరప్రేమ ప్రదర్శించుట చేత తన పని వ్యర్థమైనా తెలుగు సాహిత్యములో అమె చిరంజీవిగా వర్ధిల్లు తుంది.

ఇలాంటి ఆడుబిడ్డలు సాహిత్యములోనే కాదు, సజీవంగా ఇంటింటా వున్నారు. వీరు వున్నారుకాబట్టే యింకా కలియుగములో ధర్మము మూడుకాళ్ళమీద కుంటుతూనేవా వుంది. ఆడబిడ్డల అధి కారము చెల్లుతూవున్నది. ఎక్కడ ఆడబిడ్డలు బాధ్యతలు వదులు కున్నారో వారిహక్కులు యచటితోనే జారవిడచి వుంటారు.

ఆడుబిడ్డల అగ్రస్థానము ఆంధ్ర మహిళలకు అప్పుడప్పుడు ఇబ్బంది కలిగించినా గర్వకారణమే.



# యదార్థవాది లోకవిరోధి

**జీ**వితములో కొన్ని ఆదర్శాలు పెట్టుకుని జీవించేవారు కొందరు. మరి కొందరు గాలి పటములా ఎగిరేవారు. కాని గాలి ఎటొస్తే అటు జోరుగా ఎగురుతుంది గాలిపటము. అది ఎంత ఎత్తుకు పోతే అంత ఆనందము కలిగిస్తుంది ఎగరేసేవారికి. అట్లాగే గాలిపట ములాఎగిరేవారు వారి అనునాయులకు వారియాత్రా ఔన్నత్యము లనుబట్టి ఆనందము కలుగచేస్తూంటారు. ఈ హుషారులో దారము తెగి గాలి పటము మటుమాయమైతే ఎగరేసేవారు మన ప్రాప్త మింతేనని సరిపెట్టుకుంటారు. ఎగిరిపడ్డ గాలిపటము చెట్లకు, ముళ్ళకు కొమ్మలకు, తగిలి చినిగి ముక్కలు ముక్కలై 'నాఖర్మ' యని విల పిస్తూ అంతిమయాత్ర చేస్తుంది.

ఎంతటి చిత్రమైన వేదాంతము! పాపులకు పుణ్యాత్ములకు సమాన భావముతో ఆదరించి ఓదార్చి పోషించుతుంది. ఔరా భారత భూమి ఎట్టివేదాంత కుసుమాన్ని భారతీయులకిచ్చింది. దాని సౌరభ్య గ్రహణముతో జీవితమార్గాన్ని జీవితముక్తిని గాంచుచున్నారు.

క్వినైను మాత్రవలెవుండే మాత్రను తియ్యగా చేయగల మన వేదాంత కోవిదులు అభినందనార్హులే కదా?

పోతే నైతికంగా అవలోకించుదాము. ఇవి ధర్మాలు ఇవి అధర్మాలు అని పెద్దలు చెప్పారు. వారుచూసొచ్చి చెప్పలేదనుకోండి మనము చూసొచ్చి ఋజువు చేసుకోబోయేది లేదు. మనకు దేవుడి

చ్చిన ఆలోచనా శక్తితో వివేకజ్ఞానముతో మంచి చెడ్డలమధ్య ధర్మ అధర్మాలమధ్య ఒకగీటు వేయగలుగుతున్నాము కాని అది స్వవిషయ మయేటప్పటికి హృదయానికి కొంచెం రేజీకటి కమ్ముకు వస్తుంది. కారము మనమెప్పుడు కష్టమైనది విసర్జించి సులభమైనది గ్రహిస్తాము అంతేగాదు, వెంటనే సుఖాన్నిచ్చేది వాంఛింతము.

రాజకీయాల్లో కమ్యూనిజముని అందుకే ఆశిస్తారు.

విద్యార్థులు పరీక్షలలో అందుకే కాపీకొట్తారు.

దొంగలందుకేఇతరులుకష్టపడి సంపాదించిన ధనాన్ని హరిస్తారు.

మరి కొందరు అందుకే బొంకుతారు. అందుకే రంకుతనం చేస్తారు. మరందుకే జూదమాడుతారు. ఇన్నిమాటలేల, సప్తవ్యస నాలలో అందుకే తగుల్కొంటారు.

ఇలా పాపములోకి పడి అధోగతి పాలుకాకుండా వుండాలంటే మానవ మాత్రులు స్త్రీ పురుషులుభయులు కేవలము వేదాంతాన్ని ఆశ్రయించితే లాభములేదు. నైతిక బలములేని వేదాంతము చాలా ప్రమాదమైంది. విషముబూసిన కత్తివంటిది. వేదాంతపు కత్తిని నైతి కపు పదును పెట్టి వాడితేనే అదిశుభప్రదమైన ఫలితముల నివ్వకలదు

ఎన్ని కష్టాలుగాని, ఎన్ని దుర్మార్గాలు గాని. ఎన్ని కుటిల తంత్రములు గాని ధర్మముతో సర్వము ప్రతిష్టింపబడును. ఇది ఈ నాడు కళ్ళు దెరచిన యువతీ యువకులకు తెలిసే సత్యము కాదు. జీవితము కరుకు రంపము మరలో నలిగి కష్టసుఖాలు అనుభవించి జీవితాన్ని కాచి వడపోసిన వారికి తెలిసిన సాధారణ సత్యమే.

కాని ఈ పాపపు కలియుగములో యదార్థవాది లోకవిరోధి.

ఈ విషయము మనము పెద్దగా ఆలోచించ నవసరములేదు. వుదాహారణకు సామాన్యమైన దానము విషయము ఆలోచేద్దాము. పురుషార్ధమన్నారు. సర్వ పాపములు నశించునన్నారు. దానము ధర్మము నెరుగని విత్తము దొంపల పరమన్నాడు భర్తృహరి. దాన ధర్మములేక దాచిదాచిన ధనము వెళ్ళిపోయెడినాడు వెంట తీసికొని పోడు. తేనెటీగ లిచ్చినపగినది దొంగల కియ్యకుండా దానము చెయ్య మన్నాడు. నారశింహా శతకవేత్త. ఈ సంగతులన్నీ మనకు తెలిసినవే చాలాసార్లు విన్నాము అయినా మనము ఎందుకనోగాని దానము చేసేదానికన్నా దానముపుచ్చుకునే దాంట్లోనే ఎక్కువాశక్తి చూపిం చగలుగు తున్నాము.

నిజంగా ఆలోచిస్తే మనకు దానము ఇవ్వగలశక్తి లేదనుకోండి అంత మాత్రముచేత దానము పుచ్చుకోవలసిన అవరము ఎందుకు కలుగుచున్నదో మనమిప్పుడు సరిగా చెప్పలేము. దానము ఇవ్వ టము ఎంత పుణ్యమో పుచ్చుకోటము అంత పాపమన్నారు పెద్దలు. ఎవరో పూాత్సే అనుకోండి. అయినా మనకి ఎవరు దానము యిస్తు న్నారు. మనము ఎవరిదగ్గిర పుచ్చుకుంటున్నాము. ఎవరేనా స్నేహి తులు ఏదైనా పంపిస్తే అది ప్రెజంటాయె. అది పుచ్చుకోకపోతే వారి మనస్సుకు చాలా కష్టము కలుగుతుంది. అందుకని పుచ్చుకుం టాము. అదికాక అది దానముకాదు. లంచము కాదు. చక్కని ప్రెజెంటు. పవిత్రమైన స్నేహా బంధముకు చిహ్నాము. అయినా ఆ నాడు భాగవతములో.

"ఆదిన్ శ్రీసతి గొప్పుపై.................

అనలేదూ? ఇచ్చేవాళ్ళు పుచ్చుకునే వాళ్ళ స్టేటస్‌ను బట్టి ఈ

దానము మంచి చెడ్డలు నిర్ణయించాలి. ఫురానాగా ఫలానిగారు రోడ్డుమీద లిఫ్టు (అంటే కారులో ఎక్కించుకోవటము) ఇస్తే అది దానమా? ఆ ఫురానాకు కారుండి లిఫ్టుయిస్తే తప్పేముంది. వెళ్ళితే అసలేలేదు. సమయము విలువ తెలిసిన వారెవరూ నిరాకరించరు. రేపు నేను కారు కొనుక్కున్నప్పుడు నేను మాత్రము వాళ్ళందరికీ లిఫ్టు ఇవ్వనూ !

"పరశయ్యాసనోద్యాన గృహవాయనానివర్జమేత్" ఇతరుల పక్కలు ఆసనములు, వాహనములు. గృహములు స్వీకరించరు ఎవరు? స్వేచ్ఛాప్రియులు అదిగదిగో అక్కడేవుంది పొరపాటు. సేచ్ఛాప్రియులు ఇతరుల సొమ్మునుఆసించక పోవచ్చును కాని అసలు స్వేచ్ఛ అంటూ ఒకటివుందా? స్వేచ్ఛా ప్రియులంటూ కొందరు వున్నారా అదంతా ఒక బూటకనాటకమే? గాని సర్వ స్వతంత్రులంటూ మానవులెవరూ లేరు.

అట్లాగే సత్యము చెప్పుట ధర్మము తప్పకుండుట వగైరాలు నేడు నైతిక శాస్త్రగ్రంథములలో వుండదగినవే గాని జీవితములో వుపయోగపడే సిద్ధాంతాలు మాత్రము కావు. అవి ఏనాడు ఏ కాలములోను వుపయోగపడలేదు. అందుచేతనేగా సోక్రటీసుకు గ్రీసులో ఆగతి పట్టింది!

పోతే హరిశ్చంద్ర చంద్రమతులకు నలదమయంతులకు, ద్రౌపదిపాండవులకు, సీతారాములకు కలిగిన ధర్మవిజయము సంగతేమిటంటారేమో—ఆ కథలన్నీ పుక్కిటి పురాణాలు కట్టుకథలు కదటండీ, నాలాగేదో! హాస్యంగా వ్రాశారు ఎవరో పనిలేని కలముగాళ్ళు !



# మనకి తలతిక్కా? చాదస్తమా?

ఏదీలేదు మాకు అని కొందరు మహానుభావులు అనవచ్చు. అనక పోయినా అనుకోవచ్చు. కాని నేను మాత్రము ఒప్పుకోను. మనకందరికీ తలతిక్క, లేక చాదస్తమో గాని అసలు లేదనడానికి వీలులేదు. అది ఏదీ అని మాత్రం నేను నిర్ణయించి చెప్పజాలకున్నాను.

లేకపోతే చూడండి— మన నాగరికత, మన సంస్కృతి, మన పురాణాలు, మన వేదాలు అన్నిటిలో స్త్రీకి మనవాళ్లు ఎక్కడ స్థానమిచ్చారు? ఉత్తమోత్తమమైన స్థానమిచ్చి గౌరవించారు. ప్రస్తుతము స్త్రీలను— వుంచవలసిన స్థానములో వుంచుతున్నారు. పెరుగుట విరుగుట కొరకే గనుక మరే ఇతర దేశాలలోవలే మన స్త్రీలకు హద్దు పద్దు లేని స్వాతంత్ర్యమివ్వకుండా కాగితాలమీదా, అసెంబ్లీలలో, లోక్ సభలలో, ప్రపంచదృష్టిలో భారత స్త్రీలకు సర్వ స్వతంత్రము ఇస్తూ గిరిగీసి, గిరి దాటకుండా హద్దుపద్దులో వుంచి ఆమె తన స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగము చేయకుండావుండుటకు పురుషులు చాలా కష్టపడి బాధపడి వారిని వెయ్యి కండ్లు కనిపెట్టి సంరక్షించుచున్నారు. భవిష్యత్తులో భారతనారికి మరింత స్వాతంత్ర్యము! కారణము అప్పటికి ఆమె స్వరక్షణ నేర్చుకొనగలదు. పురుషులకు రక్షణభారతము తగ్గగలదు. ఈ రక్షణభారతము తాము

వదలుకోకపోతే సోదరీమణులు ఎట్లాగు తీసికొనగలరని మర్యాదగనే దాటుకుంటారు.

ముత్తానికెప్పుడో అలనాడు మన ముత్తాతల మహా ముత్తాత బ్రతికున్న రోజులలోనో, ఆ పైతరాలలోనో స్త్రీలకు మహోన్నత స్థానమిచ్చి వారిని ఆదరించి, గౌరవించి పూలల్లో పూజించే వారనే విషయము మనం పుట్టినప్పనుంచి ఇప్పటికి ఎన్నివేలసార్లో విన్నాను సరే మళ్ళీ ఈ నవరాత్రిళ్ళలో ఈగొడవ ఎన్నిసార్లో వినవలసివచ్చింది.

దేవీపూజ, దేవి మహాత్మ్యము యొక్క వివరాలు. విశేషాలు మీరు మొన్న చాలా వినుంటారు. శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో ఎట్లా తాను దుష్టశిక్షణ, శిష్టరక్షణల కొరకు అనేక అవతారములు ఎత్తగలనని చెప్పాడో అట్లాగే దేవి—దుర్గ—మహేశ్వరుని సతి సైతము దుష్టశిక్షణ శిష్టరక్షణల కొరకు అనేక అవతారములు ఎత్తగలనని చెప్పినదట. కావుననే ఈ నవరాత్రిళ్ళప్పుడు— దుర్గాష్టమి రోజున దేవిపూజ మనదేశ మంతటా చేయటము మామూలు. కాని ఈ దుర్గాపూజ విశేషంగా వంగదేశములో ఎక్కువగా చేస్తారు.

మనకు చాలా మందికి తిరుపతి వేంకటేశ్వరుడు ఇలవేల్పు అయినట్లు వంగదేశమువారికి చాలా మందికి కాళికాదేవి ఇలవేల్పు. వారు దుర్గని, కాళికాదేవిని వేరు వేరుగా పరిగణించి పూజ చేయటము మనకు చాల చిత్రముగానుండును.

భయంకర స్వరూపముతో, శిరములహారంతో, చిత్ర విచిత్ర భయంకర ఆయుధభూషణ బహు హస్తములతో రక్తమును త్రావు ఆసక్తితో మహా రుద్రస్వరూపము కాళికాదేవి. లోకమాత, మాతృ

స్వరూపిణి. సర్వరక్షకురాలు. భవాని, లోకేశ్వరి, మహేశ్వరి దుర్గాదేవి-

వంగదేశమునకు రాజధానియైన కలకత్తా పట్టణములో పెద్ద కాళీ దేవళమున్నది. కాళికాదేవళమునుబట్టే కలకత్తాకు (కాళీఘట్ట ముగల పట్టణము (కాలికాట్ర) ఆ పేరు కలిగినదని చెప్పెదరు. కాలి కాట్రలోని పెద్ద దేవళము గాక కలకత్తాలో అనేకచోట్ల చిన్నచిన్న కాళీదేవళము లున్నవి. ఈ కాళికాదేవిని వంగదేశీయులు ఎంతో భయభక్తులతో పూజించుతారు.

కాని దుర్గపూజ ఏలనో భయముతోగాక ప్రేమతో చేస్తారు. ఈ నవరాత్రులలో వారు పెద్ద మట్టి దుర్గ బొమ్మలు ఏర్పాటుచేసి దుర్గాష్టమినాటినుండి విజయదశమి వరకు పూజచేసి, విజయదశమి పూజానంతరం పడవలలో ఆ విగ్రహములను పెట్టుకొని గంగానదిలో కలిపి వేసెదరు. ఈ దుర్గపూజ, తరువాత విగ్రహమును గంగానదిలో కలిపివేయుట చాలా ఆడంబరముగా, ఉత్సాహముగా, ఉద్రేకముతో బెంగాలీలు వారిదేశములోనేగాక వారెక్కడుంటే అక్కడ అందరూ కలిసి చేయుదురు.

ఈ దుర్గపూజకు ఎట్టి కుల వివక్షతాలేదు. బెంగాలీలందరూ చేసెదరు. భగవద్గీత హిందువులకు బెంగాలీలకు ఎంత పవిత్రమో, ముఖ్యమో, దేవీ మహాత్మ్యముకూడ అంత పవిత్రమూ, అంత ముఖ్యమూను. భగవద్గీతలో కృష్ణునకెట్టి స్థానమో, దేవిమహాత్మ్య ములో దుర్గకు అట్టి స్థానమే మన మతగ్రంథములలో సహితము ఈ ఆడ మొగ భేదము ఏలతీసుకొని రావలసివచ్చినదో? మరిదీనిని ఏమంటారో ? ఏ మన్నారో ! ?

ఈ ఆశ్వయుజ మాసంలోని నవరాత్రుల ఉత్సవములు మన వివిధ ప్రాంతాలలో వివిధములుగా జరుపుతారు. వంగదేశములో దుర్గాపూజ ముఖ్యం. ఉత్తరహిందూస్థానంలో రామలీలలు ముఖ్యం. విజయదశమి రామవిజయముగా పరిగణింపబడుట చిత్రము. ఇచ్చట ఉత్తర హిందూస్థానములో ఈ నవరాత్రులు రామాయణ గాథంతా మొట్టమొదటనుంచి ఆరంభించి చెప్పుదురు. పెద్ద పెద్దరామాయణ గాథలోని పాత్రల బొమ్మల వూరేగింపుచేసి రామరావణ యుద్ధానంతరము మహా ఉద్రేకముతో ఆ పెద్ద రావణాసురుని బొమ్మ (ఇది సుమారు ఏబది అడుగుల ఎత్తుండును) కాల్చివేసి రాముడు అయోధ్యకు పట్టాభిషేకము చేసుకొనుటకు వచ్చుట. ఒక పెద్దవూరేగింపు, టపాకాయలు మందుగుండు సామానులు మేళతాళములతో చేయుదురు. తులసీదాసుని రామాయణానుసారమైనకథ అక్కడక్క జానపద గేయములు సినిమాపాటల బాణీలలోచెప్పించి రామాయణగాథంతా చాల మనోరంజకముగా చెప్పుదురు. సాధారణముగా ఈ కథ చెప్పువారు ప్రత్యేకము ముఠాలుగా ఉందురు. ముఖ్యమైన ప్రదేశములలో కాశీనుండి ఈముఠాలనురప్పింతురు. ఈ వూరేగింపు నాటకములకు కావలసిన బొమ్మలు అట్టలతో, చెక్కలతో, బొంగులు, రంగుకాగితములతో తయారుచేయుదురు. చిత్రము ఈ బొమ్మలు చేయువారు మహమ్మదీయులు! వీరు హిమాలయా ప్రాంతవాసులై నప్పటికీ ఈ కాలములో ఉత్తర హిందూస్థానములోని ముఖ్యపట్టణములకు దసరాకు ఒకటిరెండు నెలలకు పూర్వమేవచ్చి ఈ బొమ్మలను చేసిపెట్టివెళ్లుదురు. వారు కుటుంబసమేతముగా వచ్చి వెళ్లుదురు. వారు వంశ పారంపర్యంగా ఈవృత్తినే అవలంబించియుండువారట. సుమారు ఒక్కొక్క కుటుంబము ఈ నవరాత్రులలో ఒకటి రెండు వేల రూపాయలు సంపాదించుకొని ఇండ్లకు తిరిగి వెళ్లుదురు.

ఈ ఉత్సవాలు పాతకొత్తల మేళవింపుతో శ్లోక సినిమా బాణీల పాటలతో చాలా రమ్యంగా వుంటవి. మొన్న జరిగిన ఒక ఉత్సవములో జానకిని జనకుని ఇంటినుండి స్వయంవరం అనంతరం అత్తవారింటికి పంపునప్పుడు సారెతో ఊరేగింపుజరిగింది. ఈఊరే గింపులో పూర్వము రధమువంటి దానిలో సీతారాములు కూర్చుని వున్నా. సారె అధునిక వాహనమైన జీపులలో వచ్చినది. పైగా ఆసారెలో ఆధునికసామాగ్రి స్టేనులెస్ స్టీలు పాత్రసామాగ్రి రేడియో కుట్టుయంత్రము మున్నగునవి. ఆనాడు 'జనకుడు' ఏమిచ్చాడో, దశరథుడు కాదు కాదు, కౌసల్యా కైక సుమిత్రలు ఏమికోరేరో ఎవరికెరుక? ప్రస్తుత నవనాగరికత ఫక్కీలో జరిగినా ప్రేక్షకులందరూ ఆనందించారు. ఎందుకు? దీన్నేమంటారో మీరేచెప్పండి - పైగా ఇక్కడి వారి మాటలను బట్టి ఈ సంవత్సరము రామలీలలు ఆకర్షించినంత జనాన్ని ఇదివరకెప్పుడు ఆకర్షించలేదట? చిత్రము ఒక ప్రక్క తెలివిజను అణుశక్తులకు విస్మయపడుతూనే మరొకదిశ రామ లీలలు చూచి ఆనందించటము, మరి ఇది.......మో.........క్కో.

కాని దక్షిణదేశములో దసరాలు వేరే విధంగా జరుగుతాయి సరస్వతీపూజ, దుర్గాష్టమి, ఆయుధపూజలు, విజయ దశమినాడు పండుగ చేసికొనుట మామూలు. ఈ ప్రాంతములలో మహిషాసుర మర్దన—అసురులపై సురుల జయమునే పండుగగా చేసికొనుట మామూలు. నవరాత్రిళ్ళు బొమ్మలు పెట్టుకొని ఇంటింటా ఒక కళా ప్రదర్శన జరుగును. అయుధపూజనాడు తాతలనాటి కత్తుల కటా రులు బళ్ళాలుంటే వాటిని పదిరోపులనుండి మెరుగుపెట్టి ఆరోజు పూజ చెయ్యడము మామూలు. కాని ఈ రోజులలో కార్లు, సైకిళ్ళు మంగలి, కంసాలి, చాకలి తమతమ ఆయుధాలుపెట్టి కూడా పూజ

మామూలు. ఎందుచేతనోగాని గృహిణి కుంపటి. అట్లకాడ, జల్లిగరిటె కత్తిపీటలకు చేయుటలేదు!

సరస్వతీపూజ రోజున పరీక్ష పుస్తకాలన్నీ పెట్టుకొని విద్యార్థులు గట్టిగా ముక్కు మూసుకొని "తల్లీ నిన్ను దలంచి......"అని గొణుక్కుంటాడు. విజయదశమి రోజు తలంట్లు, క్రొత్తబట్టలు, పిండి వంటలు, క్రొత్త అల్లుండ్ర, అలుకలు, మరదళ్ళ పరిహాసాలు, పిల్లల జయీాభవ, విజయీాభవ, విల్లు బాణముల సందడి, పేరంటాండ్ర పసుపు కుంకుమల వాయినములతో ముగియును.

కాని మహారాష్ట్రములో "శమీ శమయతే" అంటూ జమ్మి చెట్టుకు వెళ్ళుట ఆయుధపూజకు ముఖ్యము. వారికి ధర్మరాజు తమ్ము లతో అజ్ఞాతవాసమునుండి విజయలక్ష్మికి వచ్చుచుటచే పండుగ చేసు కొనుట ముఖ్య కారణము. కర్ణాటక దేశములోను పై ఆచారము ఉన్నప్పటికీ ఆరోజున జమ్మిచెట్టు ఆకులు తీసుకొనివచ్చి అందరికీ ఇచ్చి (విరోధులకుకూడా) పాత విరోధములు మరచి స్నేహముతో క్రొత్త జీవనము ఆరంభించుట ముఖ్యము కావున మనదేశములో వివిధ ప్రాంతములలోను వివిధ విధముల ఈ నవరాత్రిళ్ళ ఉత్సవములు జరిగినా— పర్యవసానము ప్రజలు అనందించేది దేనికి? సత్యము, ధర్మము, మంచి జయించినందుకు- అసత్యము, అధర్మము, దుర్మార్గము నశించినందుకు ఎవరు ఏవిధంగా ఉత్సవము జరిపినా విజయ దశమి— మానవులు వాంఛించే విజయము కొరకే.

ఇదంతా మామూలే, కాని దసరాలో విశేషము ఈ దేవీపూజ ఒక కవి అన్నట్లు

"చదువుల కొక్కతల్లి, సదసద్వివేచికిత్సల కొక్కతల్లి సం
పదలకు నొక్కతల్లి, పనిపాటల కింకొక్కతల్లి, రోగముల్
గదముట కొక్కతల్లి, విరగాసిన కామ్యఫలమ్ములన్ బడిం
బడి యొసగించు తల్లి—తొలివారల భావన ఎంతగొప్పదో !"

"తొలివారి భావన ఎంతగొప్పదో" అని అనుకుందామా లేక మనమింకా మూడు ఆకులు ఎక్కువే చదివేముకదా అని గర్వపడదామా, ఏమైనా ఈ విషయములో ఏకాభిప్రాయము కుదురుట అసంభవము, కనుక

"మచ్చిత్తత్సర్వ దుర్గాణి
మత్ప్రసాదాత్తరిష్యసి
అథచేత్త్వమహఙ్కారా
న్న శ్రోష్యసివినఙ్క్ష్యసి॥"

లోని సత్యము శ్రీ కృష్ణభగవానుడు చెప్పినా, శ్రీదేవి చెప్పినా ఒకటే గనుక పేరులో ఏముందనుకొని ఎవరినో ఒకరిని నమ్మితే మోక్షము. ఆతరువాత మన ఇష్టము. కాదు కర్మ.- బుద్ధిః కర్మానుసారిణీ కదూ !



# ఆత్మకథ వ్రాసుకోవాలా?

"అదృష్టశాలి. అదృష్టశాలి. మహారాజు జాతకము. కేసరి లగ్నము పురుషుడైతే ఏక చ్ఛత్రాధిపతిగా రాజ్యము లేలగలడు. స్త్రీ అయితే కడవలో దీపమువలే యుండగలదు. తనవారికి అదృష్టము, సుఖము, కీర్తి ఆనందము, సమకూర్చగలదు. దేహశక్తి ఎక్కువ ఆత్మ శక్తి తక్కువ."

ఇది ఎవరి జాతకమో కాదు మన జాతకమే. ఈ పై జాతకము చదివిన తరువాత నేను నన్ను సగౌరవంగా 'మన' అని దప్ప పిలుచుకొనుటలేదు.

నాకెప్పుడూ జ్యోతిష శాస్త్రమంటే నమ్మకమే. ఈ మన జాతకము చూచుకున్న తరువాత ఆ శాస్త్రము మీద మరింత గౌరవము కలిగింది. గౌరవమనేది ఎప్పుడూ ఇచ్చి పుచ్చుకునే విషయమే కదా! నా ఊరు, నా కులము, నా మతము, నా దేశమంటే నాకెప్పుడూ ప్రత్యేక అభిమానమే, అట్లా అభిమాన మున్నిదని చెప్పుకోటానికేమాత్రము భీతిగాని, బిడియముగాని లేదు. చిన్ననాడే ఉగ్గుపాలతోనే ఈ 'నా మతము' నాకు రంగరించి పోశారు. కాబట్టి ఈ సుగుణాన్ని ద్విగుణీకృతము చేసుకొనటమే నా ఆశయము. నా ఊరుమీద, మతముమీద దేశముమీద ప్రత్యేక అభిమానము కలిగి

యుండుట దేశభక్తే కదా? పోతే నా కులముమీద నాకు ప్రత్యేక అభిమానముండుట చాల ప్రశంశనీయమైనదనియే నా యుద్దేశము. నాకు కులాభిమానము లేదని, ప్రాంతాభిమానము లేదని కల్లిబొల్లి మాటలు చెప్పుకొనవలసిన ఆవశ్యకత లేనేలేదు, కారణము నేను రాజకీయాలలో ప్రవేసించాలనే వూహా లేదు. సూర్యవంశపు క్షత్రియులు (అలనాటి పరశురాముని గొడ్డలికి భయపడి నేడు నాగళ్ళ చేపట్టినా) గండ రగండ కటకహోస్పర గండ గండ భేరుండ వంశీయులైన (సూర్య చంద్ర వంశ ఇక్ష్వాకులు కృష్ణా గోదావరీ మధ్య ప్రదేశ దక్షిణ పీఠ భూమిలో శాతవాహనుల తరువాత యున్న నిదర్శనము విరూపాక్షుదత్త. అశ్వమేధ సత్రములు అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జున కొండలోని నిదర్శనములు చరిత్రాత్మక రుజువులు.) నాకులము వారన్న నాకు గౌరవము లేకుండ ఎట్లుండగలదు.? నువ్వులను పిండి భుజించువారు మీసములమీద నిమ్మపండును నిలిపినవారు నేడు ఉత్తర కుమారులవలే అభినయించుచున్నప్పటికీ బహు పరాక్రమము గల వారు. అట్టివారియందు ప్రత్యేక అభిమానము కలిగి యుండుట సహజము. అయినా నా వారియందు నాకు ప్రత్యేక అభిమానముండుటవల్ల ఎవరికి ఏమి నష్టము? నా కులమువారియందు ప్రత్యేక అభిమానముండుటచే ఇతరులకు నేనెట్టి అన్యాయము చేయనూహించుటలేదు. అవసరము అసలే లేదు. ఇతరులకు అన్యాయము చేసి మనము బాగుపడవలయునను దుర్బుద్ధి మనకెప్పుడు వుండదు. పోతే స్వగ్రామము మీద ఎవరికి అభిమానముండదు?

"Breathes there a man with a soul so dead" నా గ్రామములో మురికి కాలువలు కంపెత్తుచుండవచ్చు. పొలిమేరలు

చూడనశక్యము గానుండవచ్చు. గ్రామ పీధులు పెంటపోగులవలే యుండవచ్చు, కాని నా గ్రామము బంగారు పంటలు పండించే నా గ్రామము, నా తాతలు తండ్రి. అన్నదమ్ములు పుట్టిన నా గ్రామము నా సకలైశ్వర్యములకు ఆటపట్టమయిన నా గ్రామము పాడి పంటలతో సశ్యశ్యామలమైన నా గ్రామము దేశభక్తి. దైవభక్తి, ఆత్మశక్తి నిచ్చిన నా గ్రామమును, మించిన గ్రామము మరెచ్చటా లేవు. ముమ్మాటికి లేదు. పంచవర్ష ప్రణాళికమీద ఆధారపడకుండ నిలువెత్తు వడ్ల కుప్పలలో నిలబడి, రైలెత్తు బస్తాలపై నిలబడి పసుపు పొగాకు విర్చి చేల్లుండుట మా గ్రామము ప్రత్యేకతా. ! మామీద మాకు అభిమానముండుట సహజము. నిర్బంధించి గౌరవము ఆదేశించుట అలవాటులేదు. ఇతరులు మమ్ములను జూచి ఈర్ష్యపడి విలపించితే వారికి మేము చేయగలిగిన సహాయమేమియు లేదు.

ఏమి జాతకము ! మన జాతకము. భలే జాతకము పురుషుడు కాకపోతేనేమి ! రాజ్యాలు ఎగిరి పోయే ఈ రోజులలో రాజునై ముళ్ల కిరీటము తలను ధరించకుండుటే మేలు. నేనే రాజునై వుంటే నా జాతిరక్షణకై అరంభించిన కయ్యము మూడవ ప్రపంచ యుద్ధముగా పరిణామమును బొంది యుండెడిదేమో. ఓం శాంతి. శ్శాంతి.

కడవలో దీపము దేదీవ్యమానముగా వెలుగ కలదు కాబోలు. వ్యాఖ్య అనవసరము, ఎట్టి వ్యాఖ్యగాని ఆత్మ స్తుతికాగలదు.

తన వారికి సేవచేయుట మహా అదృష్టము.

దేహశక్తి తక్కువ. ఫరవాలేదు. 'నా ఆరోగ్యము సరిగా లేదనిచెప్పి తప్పించుకొన దలచుకొన్న వన్నీ తప్పించుకోవచ్చు. ఆత్మశక్తి ఎక్కువ యుండుటవలన దేహశక్తి లేకపోతేనేమి? ఆడ

పోలీసుల రక్షణకు పురుష ఉద్యోగులు అవసరముగాని ఆత్మశక్తిగల స్త్రీకి ఎవరి రక్షణా అవసరములేదు. ఆత్మశక్తియే ఆమెకు శ్రీరామ రక్ష— నాఆత్మకథ రచించేటప్పుడు ఈరచనే మొదటి అధ్యాయముగా యుండగలదు. ఆత్మస్తుతి లేని ఆత్మకథ నిస్సారము. నిజమైన ఆత్మకథ అతిశయ పూరితముకాగలదు.

అదే ఇప్పుడు వచ్చిన చిక్కు. నా ఆత్మకథ నేనే వ్రాసుకోవాలా లేక నా జీవితకథ వ్రాసే బాస్వెల్ ఎవరైనా దొరకుతారా?



# ఓషధీదధి

ఈ మధ్య సంస్కృతము మోజు చాలమందికి తగిలింది. నాక్కూడా ఆ వ్యాధి సోకుతుందేమోనని భయపడ్డాను గాని అదృష్ట వశాత్తు శీతజ్వరము వలె ఏదో స్వల్పములోనే తప్పుకుంది అట్టేబాధ పెట్టలేదు. తీవ్రంగా గనుక తగిలినట్లయితే మా చిన్నప్పటి సంస్కృత పండితుడి వలే ముక్కుతో మురబెట్టుకోవలసి వచ్చేది. మనకు బిడాల మంటే ఏమిటని అడిగితే మార్జాలమని చెప్పే పండితుని మాటలువిని నిర్ఘాంతపోయే భాషాజ్ఞానము మనదైనప్పుడు ఈ సంస్కృత పద జాలము చాలా గొడవగావుంది. ఏదో నిఘంటువు సహాయముతో దధి అంటే పెరుగు అని తెలుసుకోగలిగాను. ఈ శ్రమంతాపడి తెలుసుకున్న తరువాత తద్దినాలుపెట్టించే మా పురోహితుని దధి, దహి. అఘోరింతలు జ్ఞాపకమునకు వచ్చినవి, ఇంతకీ నేనిప్పుడసలు చెప్పదలుచుకుంది సంస్కృతము గొడవగురించి మాత్రముకాదు. చెప్పుదామనుకున్నది పెరుగు విషయము.

అసలు వస్తుతా నేను భోజన ప్రియురాలిని. వేడి వేడి పొగలు గ్రక్కే అన్నము, కమ్మని అప్పుడే వెన్న గాచిన నెయ్యి, ఆవకాయ, పప్పు, చిక్కటి పులుసు, వంకాయ వేపుడు, మీగడపెరుగు, వేసుకొని ఆ పైన సావకాశముగా ఓ 'కవిలె' 'పాను' వేసుకుంటే ఆ

ఆనందము అనుభవించాలిసిందేగాని చెప్పనలవికాదు. చివరికి శ్రీనాథుడంతటివాడికికూడా గేదె గడ్డపెరుగు బాగుంటుందనే అన్నాడుకాని వివరంగా దానిరుచి వర్ణించ లేకపోయాడు. శ్రీనాథుడి వర్ణనకు ఒక సవరణచేసి నేనుచెప్పేదేమిటంటే "ప్రత్తి గింజలు మేసిన గమిడిబర్రె గడ్డ పెరుగు" చాలా రుచి అని. తింటే అట్లాంటి పెరుగే తినాలి, లేకపోతే ఇన్ని పంపునీళ్లు పోసి కవ్వముతో గిలగొట్టి నిమ్మకాయ మజ్జిగనీళ్ళన్నా త్రాగాలి.

కాని నేనీ వుద్దేశాలలో వుండగనే ఈ "ఓషధీదధి" ఆగమన వర్తమానము వచ్చింది. బహుశా మీరు ఈ వార్త వినే వుంటారు. ఏకారణము వల్లనైనా మీకా విశేషవార్త తెలియకుంటే సంగతి ఇదీ—

భారత శాస్త్ర విజ్ఞాన పరిషత్తువారు పరిశోధనలు చేసి ఓషధీ దధిని తయారు చేసినట్లు లోకసభలో ప్రకటితమైనది. ఈపరిశోధ నలను సాగించడానికి పరిషత్తుకు కేరళలో ఒక జీడిపప్పు కంపెనీ వారే తయారుచేసి ఇచ్చారట.

అంటే ఈ దధికి జీడిపప్పునకు ఏదో విధమైన అవి నాభావ సంబంధముండి ఉండాలి. అదిగాక మన మందరము వుప్మాలో, పరమాన్నములో జీడిపప్పు వెతికి ఏరుకుని తినేవాళ్ళమే గనుక ఈ జీడిపప్పు చుట్టము దధి మనకు రుచిగానే ఉండేందని తోస్తుంది.

ఇది మామూలు పెరుగులాగే వుంటుందా అన్న ప్రశ్నకు లోక సభలో మంత్రి సత్తముడు ఇలా జవాబు చెప్పారట— "మన దేశంలో ఈ పరిశోధన జరిగి ఇది తయారైంది. కాబట్టి బాగానే ఉంటుందని అనుకుంటున్నాను. ధర కూడా సరసంగానే వుంటుంది.

మామూలు పెరుగుకన్న తక్కువ. పిండిపెరుగుకన్న ఎక్కువ ధర పలుకుతుంది

నాకు మంత్రిగారి మాటలు బాగా నచ్చాయి. ఆయనతో పూర్తిగా నేను అంగీకరిస్తున్నాను. మన దేశములో తయారైనవస్తువ ఆయన అన్నట్లు బాగుండకుండా ఎట్లా వుంటుంది? మన దేశములో తయారైన వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు. తంత్రాలు, యంత్రాలు అన్నీ బాగున్నట్లే అదీ తప్పకుండా బాగుండివుండాలి. ఇహ రెండోపాయింటు. మాకు మరీ నచ్చిన విషయము. సంపాద నను ఖర్చులతో సమతూనికయందు నిల్పలేక సతమతమౌతున్న ఏ గృహిణి సరసంగా పెరుగు దొరుకుతుందంటే సంతసించకుండా వూరుకోగలదు? పైగా మంది ఎక్కువైతే మజ్జిగ పల్చబడవలసిన ఇబ్బంది వుండదు. కాబట్టి గృహిణులకు ఇదొక శుభవార్త. బహుశా ఇది మనకు దీపావళి కానుక !



# లోకోభిన్నరుచిః

ఇల్లాలును జూచి యింటిని చూడమన్నారు పెద్దలు. కట్టు బొట్టును చూచి యింటిని చూడమన్నారు మానసిక శాస్త్రజ్ఞులు. ఈమధ్య స్త్రీల ఉడుపులను గురించి చాలా తీవ్రంగా ఆలోచనలు సాగినట్లు కనపడుతుంది. అందుచేతనే మొన్న మన రాజధానైన ఢిల్లీలో చీరెల ప్రదర్శనము భారతీయ వస్త్రాలలో పాశ్చాత్యుల వస్త్రాలంకరణ వేనిటీఫేరు— అనబడే ప్రదర్శన జరిగింది.' అది ప్రతి సంవత్సరము జరిగే ప్రదర్శనలైనా ఈసారి ఎందుచేతనో అందరి మనసులు స్త్రీల వస్త్రములను ఆకర్షించినవి.

ఒకప్పుడు స్త్రీల వస్త్రములు ఆకర్షణీయమైనవి కావని కాదు. అలనాడు దొంగ కృష్ణుడు జలక్రీడలాడుచున్న గోపికల వస్త్రము లపహరించినదిగా స్త్రీల వస్త్రములమీద పురుషుల కెంత మోజో పోతన మహాకవే రమ్యంగా చెప్పాడు. అది మేమంటే సబబుగా వుండేది. కాదేమో. కాని వీలున్నపుడల్లా వేళా పాళా లేకుండా స్త్రీల వస్త్రాలంకరణ గురించి ఎవరో ఒకరు ఏదో ఒకటి అనకుండా వుండరు. ఈమధ్య పార్లమెంటులో కూడా దాని విషయములో కలుగ జేసుకోవలసివచ్చింది. సరే! రాజకీయవేత్తలకు పనిలేనిది దేనితో గనుక, వారసలు దేశభక్తిని వస్త్రాలంకరణతోనే కొలుస్తారయ్యో!

ఆ అమ్మ ఖద్దరు చీర కట్టితే దేశభక్తురాలుగా చెలామణి కావచ్చు-కాంగ్రెసు దేవుని అభయ హస్తము ఆమెకు కల్పవృక్షము కావచ్చు అది వేరే సంగతి అనుకోండి.

పురుషులు సహజంగా తమభార్యలు, కుమార్తెలు బాగా బట్టలు కట్టుకుంటేనే సంతోషించుతారు. (కాని వారికి ఆ సంతోషములోను ఇతర విచిత్ర వస్త్రధారుణులైన స్త్రీమూర్తుల సౌందర్యములోని ఆనందములోను కొంత మార్పు లేకపోలేదు.) పైకి బట్టల క్రింద చాలా ఖర్చు అవుతున్నదని విసుక్కుంటున్నా వారి భార్య మంచి మంచి చీరెలు కట్టుకోవాలనే అభిలషించుతూవుంటారు. అందుచేతనే భార్యలు ఈ విషయములో భర్తల ప్రోత్సాహింపులను వింటూనే బట్టలక్రింద బాగా ఖర్చు చేస్తూవుంటారు. అసలు విలువగల చీరెలను భార్యలకు కొనిపెట్టడము వారికి ముచ్చట, సరదా, గర్వకారణము కూడాను. కొంతమంది భర్తలు వారి భార్యలకన్నా మంచి సెలక్షను చేయగలిగిన వారు కూడా వున్నారు. సాధారణంగా వారే వారి భార్యలకన్నా ఎక్కువ విలువైన చీరెలను కొంటారు. ఈ రోజులలో మన సోదరీమణులెవ్వరూ విదేశపు బట్టలు విరగబడి కొనటములేదు. ఖద్దరుబట్టలు కట్టేవారు తప్పనిసరిగానో, అలవాటు వల్లనో, లేక ఏదో భ్రమతోనో కాని దాంట్లో ఏమీ పెద్ద ఆనందము అందము చూచి కాదన్న సంగతి అందరికీ తెలిసిన రహస్యమే. అయినా రాజకీయ వేత్తలు (కాంగ్రెసువారు) ఖద్దరే కట్టమని నిర్బంధించటములోని చిదంబర రహస్యము ఆ పెరుమాళ్ళకే ఎరుక!

వికారముగా వస్త్రాలంకరణ చేసుకునే స్త్రీలువున్నట్లే కొంతమంది భర్తలు తమ భార్యలని సన్నని వస్త్రములు వికారమైన వస్త్రములు ధరించవద్దని నిర్దేశిస్తారు. అది ఎంతో సబబుగావుంది. అంత

వరకు కథ బాగానేవుంటుంది కాని తరువాతే కథ అడ్డము తిరిగేది. ఈ ప్రముఖులే కొందరు ఆ విధంగా అలంకరించుకొని పోయే స్త్రీలను చూచి మంత్రముగ్ధులై స్థంభించిపోతారు ట్రాఫిక్ రూల్సు కూడా మర్చిపోయి. ఆ వస్త్రాలంకరణలో అంతటి ఆకర్షణ శక్తి వుండి వుండాలి!

వస్త్రాలంకరణలో ఆకర్షణశక్తి లేదని ఎవరూ అనలేరు. స్త్రీకి గాని, పురుషునికి గాని వస్త్రాలే ఒక విధమైన అస్త్రమూ, శాస్త్రమూనూ. తన జీవితము కొంతవరకూ వారి వస్త్రములమీద ఆధార పడివుంటుంది. వారి వస్త్రాలంకరణను బట్టి వారి గుణ గణాలను అనుభవజ్ఞుడు ఇట్టే పసికట్టగలడు, వస్త్రాలంకరణలో మార్పులవల్ల ఆవ్యక్తి మనోదృక్పథములో కొంత మార్పు కలుగుతుంది. కాబట్టి ఒక్కొక్క వృత్తిలోనున్నవారికి కొన్ని రకములైన దుస్తులు, కొన్ని రకముల పనులు చేసేవారికి కొన్ని రకముల వస్త్రములు వుప యుక్తముగా యుంతును. దానికితోడు అందము చందము కూడా కొంతవరకు ఆ వ్యక్తులకు తోడ్పాటులేక ప్రతిబంధకము కలుగజేస్తూ వుండును.

ఈమధ్య కొంతమంది ఓ ప్యాషను అలవర్చుకున్నారు. బాగా వస్త్రాలంకరణ చేసుకున్న స్త్రీలను ఎగతాళి చేయుటము అలవాటు చేసుకున్నారు. ముఖ్యంగా సంఘసేవ చేస్తున్నామని పల్లెటూళ్ళలో తిరిగే స్త్రీలు వీరికి బాగా గురైనారు. అందుచేతనే మొన్న మహిళా సంక్షేమము ఆధ్యక్షురాలు కలుగజేసుకుని వారికి అభయమివ్వవలసి వచ్చింది.

అంతేగాదు మొన్న కొంతమంది స్త్రీలు- సంఘ సంస్కర్తలు బజారులో పికెటింగు మొదలుపెట్టారట. అసభ్యమైన స్త్రీల వస్త్ర

ములు దుకాణములలో ప్రదర్శించవద్దని అలజడి చేశారట. అలా చెయ్యటమువల్ల దుకాణ దారులు వారి వ్యాపారము దెబ్బ తింటుందని వాపోయారట. కాలేజీ విద్యార్థినులు మాత్రము- వీళ్ళు క్రిందటి శతాబ్దపు చాదస్తపు స్త్రీలని' సంఘ సంస్కర్తలనందరినీ దూసి పోసినారట!

సంఘ సంస్కర్తలు కాదన్నా, భర్తలు కాదన్నా స్త్రీలు- యువతులు చక్కగా అలంకరించుకోవటము మానరు. అదివారి సౌభాగ్య చిహ్నము. మానుకోమని నిజంగా ఎవరూ కోరనూ కోరరు. లోకో భిన్నరుచిః- ఒకరికి బాగున్నది యింకొకరికి బాగుండదు, భార్యలు ధరించే వస్త్రాలు సంఘ సంస్కర్తలు ధరిస్తే బాగుండదు. వీరు ధరించేవి విద్యార్థినులు దరిస్తే బాగుండవు. కాబట్టి ఎవరికి బాగున్నవి వారు కన్నులపండువగా, ఎవరికి యుక్తమని తోచిన విధానములో వారు వస్త్రాలను అలంకరించుకొని మనోరంజకంగా వుంటే లోకము ఏమన్నా ఫరవాలేదు. అనే మాటలు నిజంగా అంటున్న మాటలు కావు. అనాలని అంటున్న మాటలే. సుందరమైన వస్తువు ఆనందాన్ని కూర్చటము సహజము.

ఒక ఆంగ్లకవి 'ఏథింగ్ ఆఫ్ బ్యూటీ ఈస్ ఎజాయ్ ఫర్ ఎవర్' అన్నాడు-

కాని మరొక ఆంగ్లకవి "ఫర్ ఎవర్" అంటానికి వీల్లేదన్నాడు. ఆ సంతోషము ఆనందము క్షణికమే అని ఆయన వుద్దేశము.

జీవితాలే క్షణ భంగురాలైనప్పుడు జీవితము లోని ఆనందము క్షణికమేనని వాపోవటము అవివేకమేమో!



# మహిళాసంస్థలు - గ్రామీణ మహిళలు

దేశమంతటా కోకొల్లలుగా మహిళా సంస్థలున్నని. అని ఎంత సేవ చేస్తున్నవి? కొంతవరకే. ఇంకా ఎంత చెయ్యాలి? చాలా చెయ్యాలసినది వున్నాది. ఏమి చెయ్యాలి? ఈవ్యాసంలో చెప్పలేము. భారత మంతవుతుంది వ్రాస్తే. ఎప్పుడు, ఎట్లా చెయ్యాలి? నిజంగా ఆశక్తి వున్నావాళ్లకి కృషిచేసి చూచి తెలుసుకొనగలరు. సంఘ సంస్కర్తలమని కొందరు చేస్తున్న ఘోరకృత్యములో ఈ గ్రంధమున వేరొక చోట రాసితిమి సంఘసేవ చేయదలచుకున్న వారికి పవిత్రమైన సాంఘిక సంస్కార హృదయము అవసరము.

ముగ్గురు కూలీలు రాళ్ళు పగలగొట్టుచున్నారు. మొదట వానిని ఏమిచేయుచున్నావని యడుగగా "రాళ్ళుకొట్టుచున్నా" నన్నాడు.

రెండవవాడు ఆ ప్రశ్నకు "పొట్టకూటికి రాళ్ళు పగల కొట్టుచున్నాను.

కాని మూడవవాడు అదే ప్రశ్నకు "దేవాలయము కట్టుటకు రాళ్ళుపగలకొట్టుచున్నానని" ఎంతోగర్వంగా ఆనందముతోచెప్పాడు. ముగ్గురు వ్యక్తులు చేయుచున్న పని ఒకటే, అయినా వారు ముగ్గురు

ఆ పనిని విభిన్న దృక్పథంలో చూచారు. అట్లాగే పెక్కుమంది స్త్రీలు సంఘసేవ చేస్తున్నా, వారు ఆ "సేవ"ను ఏ దృక్పథంలో చేస్తున్నారా అనేది చాలా ముఖ్యము. తాము చేస్తున్న పని గొప్పదని నమ్మి దానిలో ఆనందము గర్వము కలిగి చేసే సంఘ సేవిక కృషి తప్పక ఫలించగలదు. కాబట్టి సంఘ సేవ చేస్తున్న, చేయ నున్న సోదరీమణులు వారికది అపూర్వ అవకాశముగాదలచి తాము చేస్తున్న కార్యములోని దివ్యత్వము గ్రహించి మానవసేవ మాధవ సేవే యని తలంచి గుడి కట్టుటకు సహాయపడుతున్న కూలీవానివలె ఆనందముతో తమ కృషి సాగిస్తే ఆ కృషి నిరర్థకము కాజాలదు. మొదటి రెండవ కూలీలవలె ఏదో సంఘ సేవ చేస్తున్నామని చేసే సేవ, పొట్టకూటికి చేస్తున్న సేవ, రెండూ సార్థకము కాగలవు. కావున సంఘసేవా కార్య రంగములో నున్న సోదరీమణులు తాము చేయు చున్న సత్కార్యములోని విలువ గ్రహిస్తూ తదనుగుణంగా సేవా కార్యక్రమము నిర్వహించదగును

గ్రామీణ మహిళల పరిస్థితులు, కష్టసుఖాలు ఎంత వరకు సాను భూతితో సావకాశంగా, సంపూర్తిగా పరిశీలించారు? దేశభవిష్యత్తు అంతా గ్రామాలమీద ఆధారపడివుందని మన నాయకులు పదే పదే వుపన్యాసము లివ్వటము హెచ్చరించటము జరుగుతూ నేవుంది. కాని గ్రామములు ఎంతవరకూ గ్రామీణ మహిళలపై ఆధారపడియున్నదీ మనము నిజంగా ఇంతవరకూ తీవ్రముగా ఆలోచించలేదనే చెప్ప వచ్చును. ఇటీవల గ్రామములలో కొంతవరకు కొన్ని సమాజములు మహిళలతో నూతన చైతన్యముల కలిగించాయనుట నిస్సందేహము. కాని ఈసమాజమువల్ల ఎంతమంది గ్రామీణ మహిళలు లాభము

పొందారంటే వ్రేళ్లమీద లెక్కబెట్ట వచ్చునేమో. నిజంగా ఆలోచిస్తే ఈసమాజాలు ఎంతవరకు గ్రామీణమహిళలకు సహాయపడగలవు?

ఏ సమాజమునైన. ధనముపైన సంఘ సేవకులపైన ఆధార పడియుండును. ఎంతమంది సంఘ సేవకులు గ్రామములకు వెళ్లి సేవ చేయుటకు సిద్ధముగా నున్నారు. అట్టివారు చాలస్వల్పమని చెప్పుటకు మాకు చాలవిచారము. ఈ సంఘ సేవకు వలయుధనము నెవ్వ రిత్తురు? దిన దిన గండముగా కాలక్షేపము చేయు ప్రజలు దానము చేయు పరిస్థితులలోలేరు. కావున గ్రామములలో నున్న ధనవంతులే ఏ పదిమందో అట్టి సత్కార్యములకు సహాయము చేయగలరు. వారు ఎన్నిటికని చేయగలరు? గ్రామములు బాగుపడుటకు ఎన్నియో సౌకర్యములు కావలయును కదా? ఈ సౌకర్యములన్నీ ఈ సమా జములు ఏర్పరచజాలవు కావున ప్రభుత్వమే ఇవి సమకూర్చవల యును. కాని ప్రభుత్వమునకు అట్టి ఆర్థికస్థోమత లేదనీ గ్రామ ప్రజలే అట్టి సౌకర్యములు ఏర్పచుకొన వలయునని పదేపదే హెచ్చరింపబడు చున్నది.

గ్రామములోని ప్రజకు ముఖ్యంగా స్త్రీలకు వారి గ్రామాలకు ఏమి అవసరమో ఏసౌకర్యాలవల్ల వారి పరిస్థితులు చక్కబడునో ఎరుగరు. ఫలానివి కావాలని తెలసినా వాటిని ఎట్లా ఏర్పరచుకో వాలో అసలే తెలయదు. ఏ గ్రామీణ మహిళ తన గ్రామములో మరుగుదొడ్లు, పాఠశాల, ప్రసూతి వైద్యశాల అభిలషించదు? ఇవిలేక ఆమె ఎంత తిప్పలు పడుచున్నదో పట్టణ మహిళలు ఏ నాడైనా ఆలోచించారా? ఏ పెండ్లికో పేరంటముకో ఏ బంధువుని ఇంటికైన గ్రామములకు వెళ్లవలెనంటే ఈ పట్టణ మహిళలు ఏల భయపడు

చున్నారు? ఒక్కరోజు కాలక్షేపము చేయుటకే వీరు భయపడు చుండ పట్టణములలో నివసించి చదివిన ఉపాధ్యాయినులు, వైద్యులు వచ్చి గ్రామములలో నివసించి గ్రామీణులకు సహాయము చేసెదరా? ఎవరైనా పొట్టకూటికి వచ్చినా వారు సేవాసక్తితో సేవాభావముతో పనిచేయగలుగుదురా? మన యువతీ యువకుల దృక్పథము మారాలి. వారికి గ్రామీణ ప్రజలమీద నిజమైన అనురాగము, అభిమానము, ఆదరము కలగాలి. ఇవెలా కలుగుతవి? ఏదో కారణముతో పట్న వాసులను అప్పుడప్పుడు గ్రామాలకు ఆహ్వానించి అక్కడి పరిస్థితులు తెలియపరచాలి.

గ్రామములలో గ్రామీణులకు కావలసిన సౌకర్యములు ఎవరు ఏర్పాటుచేయుదురు? ప్రభుత్వము ప్రజలనుచేయమని హెచ్చ రించుతూ, ప్రజలు ప్రభుత్వమును చేయమని ప్రాధేయపడుతూవుంటే సరిపోతుందా? దాని వల్ల లాభమేమీలేదు.

గ్రామీణ ప్రజల సహకారము, ప్రభుత్వ ఆర్థిక సహాయ ముతోనే ఈ పనులు చెయ్యవలయును. ఇది వరకు గ్రామములలో పెద్ద పెద్ద రైతులుండేవారు. వారు ఏ అవసరానికైన కొంత ధనమును, వస్తు రూపములో దానము చేయచుండెడివారు. కాని వారును పాపము ప్రస్తుత భూసంస్కరణల వలన నెలకు వంద రూపాయల ఆదాయముకన్న ఎక్కువ లేనివారైరి. నెలకు వంద రూపాయల ఆదాయము గలవారు ఏమి దానము చేయగలుగు తారు? వారికి వేరే ధనార్జన లేదుకదా? ఈ వంద రూపాయలతో కుటుంబమునకు తిండి, బట్ట, విద్య వైద్య సౌకర్యములు సమకూర్చు కొనగలరా? తనకుమాలిన ధర్మము మొదలుచెడ్డ బేరము కలదా?

అట్టి స్థితిలోనున్న రైతాంగమును దానమడుగుట కూడ ధర్మము కాదు.

రేపు భూసంస్కరణలు అమలులోనికి వచ్చినప్పుడు ప్రభుత్వము మిగులుభూమి స్వాధీన పరచుకొని భూస్వాములకు కొంత పారితోషికము యివ్వనున్నది కదా? ఈ పారితోషికము చాల స్వల్పమైనదని అందరికీ తెలిసిన విషయమే. ప్రభుత్వము ఈ భూములు స్వాధీన పరచుకొనేముందు గ్రామమునకు రైతులకు కనీస సౌకర్యములు ఏర్పరచుట ధర్మము. అప్పుడు గ్రామీణులకు కొంతతృప్తి కలిగించ గలుగుతారు. గ్రామములకు వలయు మరుగుదొడ్లు, పాఠశాల, వైద్యశాలను ఏర్పరచిన అనంతరమే ప్రభుత్వము భూమి స్వాధీన పరచుకొనుటకు వుపక్రమించిద సమంజసముగా నుండుటను. మొన్న మన వ్యవసాయ శాఖామాత్యులు చెప్పినట్లు రైతులు ఆందోళనచేసి వారికి కావలసినది సరిగాఆడగనిది ప్రభుత్వము యివ్వదనిచెప్పిరి. అడగందే అమ్మైనా పెట్టదని సామెత. కావున గ్రామస్థులు యీవిషయమున పెద్ద ఆందోళన చేసి గ్రామములకు కనీస సౌకర్యములు కలిగించు కొనవలయును స్వరాజ్యము సాధించుటకు ఉపయోగించిన ఉద్యమమువంటిదే నేడు గ్రామస్థుల సౌకర్యములు సంపాదించుటకు వుపయోగించ వలయును. వారు నేర్పిన విద్యే కదా? ఉప్పు సత్యాగ్రహామువలె, విదేశవస్త్ర పికిటింగుకుజరిగిన ఉద్యమమువలె ఈ గ్రామము వెంటనే తీవ్రరూపములో ఆందోళన చేయ వలయును. అప్పటివలెనే సోదరీమణులు ముందంజ వేయగలరు. ప్రతీ గ్రామీణ మహిళా ఈపనికి నడుముకట్టి ఈ ఉద్యమమును నడుపుటకు సహాకరించగలదు. గ్రామీణమహిళ ఎంత కూపస్థ మండూకమువలె నున్నా అందరనుకుంటున్నంత 'పల్లెటూరి గబ్బిలాయి'

కాదు, ఆమె నివురు గప్పిన నిప్పుసుమా. అవసరము వచ్చినప్పుడు ఆమె సందేహించదు ! ఆలసించదు.

మొన్న విజయవాడలో గ్రామీణ భారతీయ మహిళా సంఘ ప్రథమ మహాసభ శ్రీమతి రాజబన్సీదేవిగారి అధ్యక్షతన సమావేశమై గ్రామములలో మహిళలలో విద్యా వ్యాప్తికి, ముఖ్యంగా గ్రామీణ చేతిపనులలోనూ, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, ప్రసూతి చికిత్స, శిశుసంక్షేమము, గృహపరిశ్రమములలో శిక్షణ ఇచ్చేందుకు గ్రామీణ విశ్వ విద్యాలయాన్ని ఏర్పాటు చేయవలసినదిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. వారికి ఇదే భలే మంచి సమయమని ఇవ్వదలుచుకుంటే ప్రభుత్వమునకు ఇది అనువైన తరుణమనీ అది మించకుండా గ్రామీణ మహిళా సంఘమువారు గ్రామీణ మహిళల వుద్యమము సాగించి ప్రతి గ్రామమునకు పారిశుద్ధ్య సౌకర్యాలు పాఠశాల, వైద్యశాల (కనీసము ప్రసూతి కేంద్రమైనా) ఏర్పరచి పుణ్యము కట్టుకోమని మేము హెచ్చరించుచున్నాము. వారి కార్య దీక్షకు ఇదే తరుణము. తరుణము మించిపోనివ్వద్దు. 

## హాతులు

ఈపని మంచిది ఇదిచెయ్యవమ్మా అని చెప్పితే అది సలహా అవుతుంది. ఇది చెడ్డ ఇది చెయ్య వద్దమ్మా అనిచెప్పితే మహా చెప్పావులే నిన్నెవ్వరు అడిగారమ్మా అవుతుంది. మంచి చెడ్డలు విమర్శించి, ఇవి లోపాలు, ఇవిలాభాలు ఇవి సాధక బాధకాలు అని వివరంగా చెప్పితె "అనవసరంగా ఇతరుల వ్యవహారంలో కల్పించుకోబోకు" అవుతుంది. కాని ఏదో సరదాగా మంచీ చెడ్డా, కష్టము సుఖము, లాభమునష్టము వున్నదున్నట్లుగా కచ్చితంగా, నిర్మొగమాటంగా మాట్లాడుకుని, పరిహాసింపచేసుకోనే కాలక్షేపమే హాస్కం, అసలు హాస్కం అనే పదానికి తెలుగు తర్జుమా "వూక" కాని "వూక దంపుడు" మాత్రము కాదు సుమండీ. వడ్లగింజలోని బియ్యపుగింజని వూక వేరుగ. దీసి చూపించుటే మా కర్తవ్యము. ఏదైనా తేల్చి చెప్పితే ప్రమాదాలకు గురయ్యే అవకాశమున్నది గనుక ఏ విషయాన్నీ మనము తేల్చి చెప్పకుండా, విషయాలు మా స్వంత ఫక్కిలో వివరిస్తూ వూకదంపుడు కాకుండానే ఇదివరలో మనలో మనమాటలోను, తదుపరి లోకం పోకడలోను విశదపరచి నట్లే ఇప్పుడు హాస్కంలోను నెలకొకసారి ఐదు నిముషాల కాలక్షేపము చేయాలని మా వుద్దేశము. సత్కాలక్షేపముగా పరిణమించాలనే మా అభిమతము.

ఆడదై పుట్టుటకన్నా అడవిలో మ్రానై పుట్టుట మేలని ఇప్పటికీ ఇంకా చాలామంది స్త్రీలు అనుకుంటూనే వున్నారు. కాని మరి కొందరు ఇదిస్త్రీల స్వర్ణయుగమని సంతసించేవారూ లేక పోలేదు. స్పూట్నిక్, ప్లాస్టిక్ యుగాల్లో ఇలా విరుద్ధ అభిప్రాయా లుండుట సహజము. సాంఘికాభి వృద్ధికొరకై ఎన్ని బిల్లులు అమలు లోకి వస్తేనేమి, అవి ఎంతవరకు స్త్రీలజీవితాలను సుఖమయంగా చేస్తున్నవి? స్త్రీ లోకంలో ఇన్ని ఆత్మహత్యా లెందుకు, గృహాల్లో ఇంత అశాంతి, అసౌఖ్యము ఎందుకు? స్త్రీ లెందుకు ఇంకా భరించ లేని దుఃఖము, అవమానము అహోయములైన భరిస్తున్నారు? గృహా లెందుకు స్వర్గసీమలై అలరారుటలేదు? కారణము దేశ కాల పరిస్థితులు మారినా తదనుగుణంగా మానవ మనస్సు ఇంకా పరిపక్వము గాలేదు.

సర్వ స్వాతంత్రములు స్త్రీలకు కాగితముల మీద చట్టముల ద్వారా కలిగినవి. శాస్త్రముల పుణ్యమా అని మానవులకనేక లాభ ములు చేకూరినవి. అందుచేత స్త్రీలకు స్వర్ణయుగమని భ్రమపడు చున్నారు. వారు భ్రమ పడుటకు మరి కొన్ని కారణములు లేక పోలేదు. వేగంగా మారుతున్న పరిస్థితులుతట్టుకోలేక, పురుషులు కడుపులో బాధలతోను, హృద్రోగములతోను మరణించుచుండగా అన్ని దేశములలోను కలవరపెడుతున్న పెక్కు సమస్యలకు స్త్రీలు ధైర్యంగానే తట్టుకొని సుదీర్ఘాయువులై యున్నారని వారి వాదము. ఇది కొంతవరకు నిజమే. స్త్రీలు కష్టములు వచ్చినప్పుడు కన్నీళ్లు కార్చుకొని, వారి దుఃఖమును ఇతరులకు చెప్పి బాధ ఇత రులతో పంచుకొని ఉపశమింతురు కాని మగవారు మేకపోతు గాంభీర్యముతో బెట్టుగావుండి, తట్టుకోలేక స్త్రీలకలవాటైన కష్టాలను

అనుభవించే స్వభావమునువారి క్రొత్త సాంఘిక సౌఖ్యముగా భావించుచున్నారు. ఎవరు ఏమనుకున్నా మన మంతా ఇంకా కష్టాలు తీరి గట్టు ఎక్క లేదనుట నిర్వివాదాంశము. మనదేశములో అందరి స్త్రీలకదివిదితమే !

కాని మనము ఇట్లా వున్నా ప్రపంచకము చాలా త్వరత్వరగా మారిపోతూవుంది. అంతరిక్షంలో ప్రయాణ అవకాశాలతో ఇంకా ఎన్నో ఇదివరకు కనీవినీ ఎరుంగనివి మానవాళి చెయ్యపోతున్నది. కొందరి విజ్ఞుల అభిప్రాయ ప్రకారము మనము మున్ముందు చంద్ర మండలానికి విహారమునకు (ఇప్పుడు మహాబలి పురమునకు వెళ్లి వచ్చినట్లు) వెళ్ళగలము. రోజుకి నాల్గు గంటలకన్న ఎక్కువ పని చెయ్యవలసిన పని యుండదట. అంతేకాదు. మాట్లాడుకునే బాధ కూడ వుండదట. మనస్సులతోనే ఇతరుల అభిప్రాయాలు గ్రహించు కొనే అవకాశ ముండునట. అప్పుడు మనస్సులో వకటి వుంచుకొని మరి యొకటి చెప్పే పీడ విరగడౌతుందన్న మాట.

అంతేకాదు వంటచేసుకునే పనికూడా తప్పునట. సూర్యరశ్మి నుండీ, సముద్ర జలము నుండి ఆహారము తయారగుట. అంటే మాంసాహారు లుండరు. (ప్రపంచ శాఖాహారుల మహా సభలు అన వసరము ! ) మానవులు రోగములనుజయింతురట (మృత్యువును జయించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.) అందరూ ఆరోగ్య మహాభాగ్యమును అనుభవింతురట. తెలుసు కొనగలరట. ఇవన్నీ గాక ముఖ్యంగా స్త్రీలు సంతోషించే విషయము— వారి సంతానాన్ని వారే నిర్ణయించుకోగలరట వారికి అమ్మాయి కావలిస్తే అమ్మాయి, అబ్బాయి కావలిస్తే అబ్బాయి పుట్టే అవకాశమే గాక ఒకసారే

కవల పిల్లలు కావాలిస్తే పుట్టే అవకాశముకూడా వున్నదట. అప్పటికి పెద్ద పెద్ద ఆస్థులుండవు గాని లేకపోతే మగసంతానము కొరకు నేడు పడేపాట్లు పడనవసరములేదు. పూర్వ మెప్పుడో దశరథ మహారాజు పుత్రకామేష్టి చేశాడట. ఇంకా చాలా రాజులు, రాజాధిరాజులు చేశారు. మీకా సంగతి తెలిసినదే. కాని మన గ్రామాల్లో ఇంకా పుత్రకామేష్టి చేసేవారున్న సంగతి మీకందరికీ తెలియక పోవచ్చు.

డాక్టర్ హెర్రీ లెవిన్ అనే ప్రసిద్ధ బ్రిటీష్ శాస్త్ర వేత్తకు చక్కని సంతానము. ఒక అమ్మాయి, ఒకబ్బాయి. చేసుకున్న పూజ ఫలమేమో ఏమీ కొరతలేదు. ఆయన ఎవరైనా మగపిల్లలు లేరని గాని, ఆడపిల్లలు లేరనిగాని వగచే వాళ్ళను చాలా వింతగా చూస్తాడు, కాని పిల్లలు అసలేలేనివాళ్ళు పిల్లలు కావాలని తపస్సు చేస్తుంటే చాలాజాలి పడతాడు.

ఆయనవింత ప్రవర్తనకు కారణము లేక పోలేదు. గొప్పగా, దీక్షగా, శ్రద్ధతో యజ్ఞము, యాగము, వ్రతము, నోముచేసి ఉపవసించి ప్రదక్షిణాలుచేసి ఏ శివునివో రామునివో కాళ్ళు పట్టుకుని "పాలముంచినా నీళ్ళముంచినా నీవేదేవా నాకుదిక్కు. నాతప్పులు క్షమించి నన్ను రక్షించు. దేవదేవా! నాకు లంకత ఇల్లు. అలవిగానంత భూమి వున్నది. కాని ఏమి లాభము వంశగౌరవమును ప్రతిష్టలను ఆచంద్రార్కము నిలబెట్టగల పుత్ర సంతానము లేదు. పుత్రుడు లేనిమాకు సద్గతులు లేవుకదా? పున్నామ నరకము తప్పదు. జగద్రక్షకా! నీకు తెలియనిది లేదు. నామొర ఆలకించి నాకు పుత్రునివ్వుము". అని అఘోరించితే ఆ భగవంతుడు ప్రత్యక్షమై "భక్తా!

నీ భక్తికి మెచ్చితి. వరము కోరుకొనుము, సౌభాగ్యవతియగు పుత్రిక కావలయునా లేక అల్పాయువు కలిగిన పుత్రుడు కావలయునా కోరుకొనుము" అని దేవునికుండే దర్జాతో సెలవిస్తే ఆ భక్తురాలు కృంగిపోతూ, కృశించిపోయి అల్ప ఆయుష్మంతుడైన పుత్రుడినే ప్రసాదించమని అడగవలసిన పని భవిష్యత్తులో లేదు. "ఏదైనా సరే నయ్యా దేవుడా. నీవు సంతాన ప్రాప్తిరస్తూ అంటేచా"లని అడిగితే సరిపోతుంది.

ఆ తరువాత చేయవలసింది శ్రీ డాక్టరు షెట్రీలెవిన్‌గారి దివ్య ఔషధము సేవించుటయే. ఆయన దగ్గిర మందులున్నవి. ఒకటి మొగబిడ్డ కావాలంటే తినవలసిన మందు. రెండవది ఆడ పిల్ల కావా లంటే తినవలసిన మందు. ఈ రెండో మందుకు బహుశా మన దేశ ములో గిరాకీయే వుండదు !

ఇప్పటికి ఈ మందులు ఈ డాక్టరుగారు చాలా మందికిచ్చారు. నూటికి తొంభైమంది, కోరుకున్నట్లుగానే సంతానము కలిగింది. ఒక పదిమందికి ఖర్మముకాలి సరిగా కోరుకున్నట్లు కాలేదు. దాని కెవరు ఏమిచేస్తారు? వాళ్ళకర్మ అలావుంటే, "నలరవి దేనిచేదిరుగు న్యాఘన ఖర్మము వంద్యమే కదా?" అయినా ఆ డాక్టరుగారు ఇంకా కృషి చేస్తున్నారు. ఆ నూటికి పదిమంది అదృష్టముకూడా చక్క దిద్దాలనే ఆయన అభిమతము. రాజులు ప్రభువులు ఈ ఔషధము వలన చాలా లాభము పొందవచ్చని ఆ డాక్టరుగారు మెల్లగా శెలవిస్తున్నారు. ఆయనకు మనదేశములో సంగతులు తెలియ వనుకుంటాను. పెళ్ళ యిన నాలుగోఏటనుండి, రాజ్యాలు గీజ్యాలు లేకపోయినా, వున్నా రెండు ఎకరాలకు వారసుడు లేకపోతే పుట్టిమునిగి పోయేటట్లు

నానా హంగామా చేసేవాళ్ళు, ఇప్పటికి కొంత తగ్గినా, ఇంకా ఇం టింటా చాలామంది వున్నారు. అందులో ఈ మధ్య భూసంస్కరణలు వస్తున్నవని పాపము ఎంతో వాపొయ్యారు.

పరిస్థితులు ఇలావుంటే మన ప్రభుత్వము కొన్ని చర్యలు తీసి కొనవలసి వస్తుందని డాక్టరు లెవిన్‌గారు అభిప్రాయ పడుతున్నారు. అదేమిటంటే ఒక దేశంలో అందరూ ఆడపిల్లలనేగాని, మగపిల్లలనే కాని కోరుకుంటే చిక్కు వస్తుంది గనుక ప్రభుత్వము కలుగచేసుకొని కొన్ని ఖరారులైన నిబంధనలు ఏర్పరచ వలసియుంటుంది. ఏ అస్త్రానైనా ప్రజలు దుర్వినియోగము చేయొచ్చు అది, సద్వినియోగ మయేటట్లు చూచుకొన వలసిన భాధ్యత ప్రభుత్వముదే అని సెల విచ్చారు. మన ప్రభుత్వాలకు త్వరలోనే ఇంకొక బిల్లు ప్రవేశపెట్టే సదవకాశము, పన్ను విధించే వీలు కలుగుతుందన్న మాట !

ఇహ పుత్ర కామేష్టియాగాలు అశ్వమేధ యాగాల లిస్టులోకి పోతే మన మాశ్చర్యపడ నవసరములేదు. కాని మనమూరికే అంత రిక్షంలోకి ఎగసి చంద్రమండలము చేరితే వచ్చేబాధ యేముందీ? మనతోపాటు మన ఆశయాలు, అభిప్రాయాలు అంతరిక్షంలో కి ఎగసి నక్షత్రాలవలె ప్రకాశిస్తూ మనజీవితపథానికి వెలుగు చూపోద్దూ? ★

# "సంతామైత్రీ పునస్స్వైదృశీ"

ఆని భర్తృహరి సజ్జనుల మైత్రి ఒండొరుల వ్యసనమునకు దాళనట్టి స్వభావము గలదని పాలనీరు కలయికతో పోల్చి చెప్పినారు. ఇక్కడ మనకు క్షీర నీరన్యాయముతో నిమిత్తములేదు. మహాత్ముల మైత్రి, పరోపకారుల మహాత్మ్యముతోనే మనకు అవసరము. గుణసంపన్నుడగు మిత్రుడు క్షీరము నీటికి తన స్వగుణమునిచ్చి దరిచేర్చి కొనును. అంతేగాదు మిత్రుని కొరకై త్యాగము చేయును. ఈ త్యాగము మిత్రునివలన ఏమీ ఆశించకుండా చేసే త్యాగమునుమండీ.

ఈ రోజుల్లో కొన్నికొన్ని పదాలకు అర్థమే మనకు అవగాహనయ్యే అవకాశమేలేదు. ఎక్కడ చూచిన మనుష్యులు ప్రేమని, త్యాగమని అంటూ వుంటారు. ఇప్పట్లో మనము వారు కామాన్ని ప్రేమంటున్నారని, నిగూఢమైన స్వార్థాన్ని త్యాగమంటున్నారని అర్థము చేసుకోవాలి. మంచి మంచివన్నీ ఈ యుగములో అపురూపమైపోతున్నట్లే సజ్జనమైత్రి అపురూప మౌతున్నది.

అపురూపమౌతున్నది కాని అదృశ్యము మాత్రము కావటము లేదు. కారణము "దమ కార్యంబు ఘటించుచున్ పరహితార్థ వ్యాపృతులు" ఇంకావున్నారు. వారిని భర్తృహరి మిధ్యములన్నాడు

కాని నిజంగా తమ కార్యములకు భంగము లేకుండా యితరుల కార్యము నెరవేర్చుటలో తప్పేమున్నది. తనకు మాలిన ధర్మము మొదలు చెడ్డ బేరముకదా? తన నిత్య కార్యక్రమము సాగిస్తూ, తన నిత్య సంపాదన వదలుకోకుండా ఏదో కమిషను వ్యాపారము సైడు బిజినెస్‌గా చేసుకుంటే తప్పులేదు. జీవిత ప్రమాణము పెద్దగా పెరిగిన రోజులలో అలాంటి వ్యాపారాలు చేయక తప్పదు. ఒక్కొక్కప్పుడు మిత్రులు ప్రతిమాటకి, చేతకికూడా కమిషను తీసుకుంటే ఇబ్బందే అయినా అది తప్పదు. తప్పనిది వాంఛనీయమే. కాని అంతకన్నా ప్రమాదమైన స్నేహముందే–"తమకై యన్యహితార్థ ఘాతుకజనుల వారు దైత్యులే." నిజమైన రాక్షసులే. అయినా ఏంచేస్తాము. రాక్షసుల మధ్యే జీవించుచున్నాము. ఈ రాక్షసులు తమకై ఇతరుల కార్యములను భంగపరచెదరు. అంటే పరుల కార్యము భంగపరిస్తే కాని తమకు లాభము లేనప్పుడు ఏమి చెయ్యాలి? స్వరక్షణార్థము విరోధులను నిర్మూలించటము లేదూ? అట్లాగే నాకు లాభము రావాలంటే ఇతరుల నష్టపడితేనే కదా వచ్చేది. ఇతరులు నష్టపడి తానంతటది లాభము నడచివచ్చి వరించేవరకూ ఎందుకు ఆగటము? ఇతరులకు శుభ్రంగా నష్టము కలిగిస్తే హాయిగా: మనకు లాభము స్పుత్నిక్ లాగా వచ్చి పడుతుకది!

"పాలసాగరమున బవ్వళించినహరి
గొల్లపల్లెపాలు గోరనేల
నెదుటివారి ద్రవ్యమెల్లవారికిదీపి
విశ్వదాభిరామ వినురవేమ"

వేమన మాటలు ఆనాడెంత నిజమో ఈనాడు అంత నిజముకదా.

తమ కార్యము పరిత్యజించి పరార్థ ప్రాపకులు సజ్జనులు. వుత్తములని భర్తృహరి ఏనాడో అన్నాడు కాని, అది ఈ రోజులలో అనడానికి వీలులేకుండా పోయింది. తమ కార్యములు విడచే పరుల ప్రయోజనము లొనగూర్చే వారిని 'దద్దమ్మ' యని బిరుదాంకితు లను జేసి ఇంటికప్పుమీద కూర్చోబెట్టుతారు. లేక 'చవటా' యని నాల్గు తాటాకులు కట్టుతారు. కాబట్టి తమకార్యములు పరిత్యజించి పరోపకారము చేయబూనుట అవివేకము. ఇహము లేదు వరములేదు—

పురాణ మిత్యేవన సాధుసర్వం అన్నట్లు పురాణమైనదంతా మంచిదికాదు. అయితే మంచిదేది అంటారేమో, కాలాను సారంగా ఇప్పట్లో.

"త్యానా వ్యర్థం మనోస్యర్థము—నీకు సగము నాకు సగము— అనే పద్ధతి వుత్తమము. దొంగలు దొంగలు కలిసి వూళ్ళు పంచు కున్నారని అంటారు కాబోలుదీన్నే. అన్నా పరవాలేదు. అదే మంచి పద్ధతి. నీకు సగము, నాకు సగము, ఇంకెవ్వరైనా ఆపని చేస్తూంటే గప్ చిప్ సంబారుబుడ్డి—

నేను నేర్చిన విద్యలో ఇది ఒక ముఖ్యపాఠము సుమండీ— ★

## బుద్ధిశ్శత్రువికార్త్రిణి—

అంటే ధనము సంవృద్ధిగానున్న మనస్సునువికారము నొందించును. అయితే అవుగాక, ధనములేని మనిషి పూచికపుల్లకు చెల్లడు—ధనములో వుంది అంతా. అందుకనే ధనం మిదఃజగతని పదే పదే మనకు చెప్తూంటారు. ధనము లేనిది సుఖములేదు, గౌరవములేదు—కీర్తి లేదు—శాంతిలేదు—అందుకనే ఎన్ని పాట్లయినా పడి డబ్బు సంపాదించాలి- పొట్ట కూటికి కోటి విద్యలు— అంటే కేవలము ఒక పావు శేరు బియ్యము గిద్దెడు పప్పు సరిపోదు. జీవితానికి కావలసిన సరంజామా అంతా కావాలి. తిన్న తరువాత తాగాలి, త్రాగిన తరువాత భుక్తాయాసముతో బాధపడకుండా పడుకోవాలి. పడుకోటానికి హంసతూలికా తల్పము లేకపోయినా ఒక రాతిపాన్పయినా కావాలి. నిద్రలేచిన తరువాత సేద దీర్చుకోటానికి ఆహారము. ఆనందానికి వినోదము, ఆహ్లాదానికి క్రీడ అవసరము, ఈ కార్యక్రమమంతా జరిపించటానికి గృహమనే ఒక స్థానము, కార్యక్రమము నిర్విఘ్నముగా జరిపించటానికి భార్యా బిడ్డలు, జరిపించటానికి సూత్రదారుడు భర్త అవసరము—అందుచేత సుఖంగా జీవితము గడపాలంటే గృహస్థుగా వుండటము చాలా అవసరము. ఆ పితలాటముతోపాటు డబ్బుఇంకా అవసరము. డబ్బు అవసరము ఇంతింతని నేను వేరుగా చెప్పనవస

రములేదు. ప్రతినిత్యము మన మందరము దాని అవసరము తెలుసుకుంటూనే వున్నాము.

అయితే. ఈ అత్యవసరమైన ధనము ఎట్లా వస్తుంది? తాతలు దండ్రులు తినకుండా అనుభవించకుండా మూటకట్టన్నా ఇవ్వాలి. కష్టపడి సంపాదించనన్నా సంపాదించాలి. లేదా ఏ లాటరీలోనన్నా కలసివచ్చి రావాలి. ఏదో వ్యాపారమన్నా చేయాలి, లేదా ఎవరికైనా మసి బూసి మారేడుకాయచేసి బిస్మిల్లా చేయాలి (పొలముదున్నే కర్షకుడికి మాత్రము తిండేగాని డబ్బు దొరకదు సుమండీ) పైవిధములలో ఏ విధముగా ధనము లభించినావారు అదృష్టవంతులే అది లేనివారిని దురదృష్టవంతులంటారు, అంతేకాదు ధనమున్నవారు అదృష్టవంతులుగా, పుణ్యాత్ములుగా పరిగణింపబడుచున్నారు,

అదుగో అక్కడే వస్తుంది చిక్కు. ఏ భాగ్యవంతుడినైనా అడగండి మీకు సందేహముంటే. వాళ్ళ కష్టాలన్నీ వివరంగా చెప్పినా చెప్పకపోయినా "ఎంత చెట్టుకు అంతగాలి" అని అనటముతో మనలాంటి వాళ్ళు వాళ్ళకు దూరముగా వుండాల్సి వస్తుంది. అందుకనే ధనికవర్గము, బీదలు. మధ్యరకము వర్గాలు అనే కులాలు పుట్టినవి. ఈ కులాలు కూడా మనదేశములో కులబేధాలలో వున్న విబేధాలు, వైషమ్యాలూ వున్నవి. ఈ రోగము ప్రప్రధమంగా అమెరికాలో బయలుదేరి క్రమక్రమంగా అన్ని దేశాలలో అలుము కున్నది. ఇప్పుడిప్పుడే మన దేశములోను అలుముకోబూనుతూ వుంటే రాజకీయ పార్టీల పుణ్యమా అంటూ వెనకడుగు వేసింది. మరి ఆరోగ్యాన్ని పూర్తిగా నిర్మూలించటము మానవులకు తరమా? మందులతో నయమయే రోగముకాదు. ఏమో స్ఫుత్నిక్ రోజులలో ఏదైనా సాధ్యము కావచ్చు.

అయితే ఈ ధనిక వర్గము సంగతి ఆలోచించుదాము. "సర్వే జనాః కాంచన మాత్రయింతి" అన్నారు. అంటే అందరూ ధనమును ఆశించుతారు. అది నిజమే. కాని వారు నిజంగా పుణ్యాత్ములేనా? వారు పూర్వజన్మలో పుణ్యము చేసుకుంటే నేనా ధనవంతులై పుట్టినది. కాదు, ఎంతమాత్రము కాదు.

ఏదో పాపము చేసుకున్నవారే ఆగర్భ శ్రీమంతులై పుట్టుతారు-లేదా ఆపళంగా లక్ష్మివచ్చి ఇంట కూర్చుంటుంది. ఎందుకయా అంటే మానవునికి డబ్బిచ్చి, తద్వారా ఐహిక సుఖములనిచ్చి భగవంతుడు వారిని పరీక్షచేస్తాడు. కాంచనము వలన కర్మము వదలును. ఆ డబ్బుతో ఋణశేషము తీర్చుకునే అవకాశము కలుగచేస్తాడు. పాపము పుణ్యము రెండూ అవలీలగా చేయగల అవకాశములు కలుగచేస్తాడు. ధర్మ కామ మోక్షములు సాధించటానికి అవకాశము పూర్తిగా కలుగ చేస్తాడు. ఈ విషయము ఇటు మనపురాణాలలోను అటు బైబిలులో కూడా చెప్పియున్నది ఉమరుఖయ్యాంలోను ఈ విషయము విపులంగా విశదీకరించారు. కాబట్టి ధనవంతుడు బీదవానికన్నా ఎక్కువ జాగ్రత్తగా జీవితములో మసలుకోవాలి, తను చేస్తున్న స్నేహము, తను చేస్తున్న ధర్మము, తన అతిథులు తగినవారా కాదా యని బాగుగ ఆలోచించు కొనవలయును, తను చేస్తున్న ప్రతి చేతా ముందు వెనుకలు ఆలోచించిగాని చేయరాదు. ధనవంతుడు బాగుపడేదానికన్నా చెడిపోయే అవకాశాలు ఎక్కువ వున్నవి. చుట్టూ భట్రాజులు చేరే అవకాశమున్నది. సప్తవ్యసనాలకి చల్లగా చేరే అవకాశమున్నది. ధనము పాపకార్యముల కుపయోగించే ప్రమాదమున్నది. డబ్బువుంటే చాలు అందరూ ఖర్చు చేయగలరు దానిని సక్రమంగా ఖర్చు చేయడము ఏవరికో ఒక పుణ్యాత్ము

నికి దప్ప తెలియదు. డబ్బు సంపాదించుకోవచ్చు. దానితోని ఘనత లేదు. ఎవరు ఏవిధంగా డబ్బు ఖర్చుచేస్తారో ఆ విధంగానే వారి పుణ్యము వారి ఖర్మలు నిర్ణయింప బడుతవి.

సత్కార్యములవల్ల, సత్కర్మలవల్ల ధనవంతుడు పుణ్యము సంపాదించవచ్చును. అతనికి అదృష్టవశాత్తు ఆ పుణ్యము సంపాదించు కునే అవకాశము దైవము లభింపచేశాడు. కాని పరమాత్ముని లీలలు కడు చిత్రము. పుణ్యము చేసుకోటానికున్న అవకాశములకన్న అధో గతిపాలయే ప్రమాదము ఎక్కువగా వుండును. ఏ ఒక తప్పటడుగు వేసినా ఆ జీవికి అధోగతి పాలుతప్పదు, ఆ వ్యక్తి ధనము ఒకశాపము

కాబట్టి ధనములేక లేమిచే కష్టపడేవారికి ఒక తృప్తి వుండక తప్పదు. వారికి సుఖము లేకపోవచ్చును. దానితోపాటే పాపము. వుండదు. ధనవంతునికన్నా పుణ్యము ఎక్కువ చేసుకునే అవకాశ మున్నది కాబట్టి భాగ్యము మానవుల పరీక్షార్థము దైవము సృష్టిం చిన పరిణామముగా గ్రహించాలి గాని అదే పుణ్యంగా పరిగణించ టము పొరపాటు.

ధనవంతుడై పాపముల జోలికి పోకుండా పుణ్యము చేసు కున్నవాడు ధన్యుడు. ద్విధన్యుడు (double blessed) కూడాను. ★

## తిందాము, తిందాము

తిందాము, తిందాము అన్నదట చిన్నారి చిటికన వ్రేలు. వజ్రాల ముద్దు టుంగరము ధరించిన వుంగరపు వ్రేలు ఎక్కడ తెద్దామన్నదట. అప్పుచేసి పప్పుకూడు తినటానికి అలవడిన మధ్యవ్రేలు అప్పుచేసి తిందామని సలహా ఇచ్చిందట. అప్పెట్లు తీరుద్దామని సందేహాన్ని వెలువర్చింది సత్యకాలపు చూపుడు వ్రేలు- ఎగేసి పోరిపోదామంది అసాధ్యురాలు– బొటనవ్రేలు బలగర్వముతో- క్రిందా మీదా బడి తర్జన భర్జనలైన తరువాత తిందామనే నిర్ణయించుకున్నారు.

ఏదో శుచైనవి, రుచైనవి తిందామనుకున్నది చిటికనవ్రేలు. పంచభక్ష్య పరవాన్నములు కావాలన్నదివుంగరపు వ్రేలు– బ్రతకటానికి తినుచున్నాము. తింటానికి బ్రతుకుచున్నామని వళ్లు మండి భీష్మించుకు కూర్చున్నవి మిగిలిన మూడేళ్ళు.

లోకము తీరే అంత. అసలు లేనప్పుడు ఆకలి మండుతూవుంటే ఏదో ఒకటి తినటానికి దొరికితే చాలని వుంటుంది. లేంది దొరికిన తరువాత అదిగాదు ఇది, ఇదిగాదు అది కోరుకుంటుంది- మరీ తినటానికే పుట్టిన వాళ్ళకి ఏమీ బాగుండవు- ఎప్పుడు క్రొత్త రుచుల కోసము వెతుక్కుంటూనే వుంటారు. పోనీ బాగుండ లేదన్నవి తినకుండా వుంటారంటే అదీ కాదు బాగుండలేదంటూనే తింటూ

వుంటారు. అది వారికొక రోగము. అన్నమైతేనేమి సున్నమైతేనేమి అంటూ అన్నమే, అందులో వంకసన్నాల భోజనము తిన్నా అందులో ఒక అర్థమున్నది గాని, ఇది బాగుండలేదు, అది బాగుండలేదని తినటములో అందములేదు. బాగుందని అంటూనే తించే వారికి మంచిది. చూచేవారికీ బాగుంటుంది.

కాని ఒక చిక్కు. రుచైనవి ఎక్కువ తినకూడదనేది మనము పెద్దబాల శిశు రోజుల్లోనే నేర్చుకున్నాము అనుకోండి. పోతే రుచిగా లేనివైనా ఎక్కువ తించె ప్రమాదమే. మితముగా తించే ఏ చిక్కూ లేదు. వైద్యులు చెప్పినా యోగులు చెప్పినా భోజనము మితంగా చెయ్యాలనే. అసలు కావలసిన దానికన్నా కొంచెము తక్కువగా భోంచేస్తే అన్నిటికీ మంచిది. జబ్బులు తగ్గుతవి. ఎక్కువ పని చేసుకో వచ్చు. అంతే కాకుండా కొంత మంది కడుపులు కొట్టి తాము అజీర్ణ బాధతో అవస్థ పడటము తగ్గుతుంది, ఎటు నుంచీ చూచినా తక్కువ ఆహారము తించే మంచిది. మన దేశపు ఆహార సమస్య కొంచెము తక్కువ క్లిష్టతర మౌతుంది.

ఈ రకాలు గాక ఇంకో దగుల్బాజీ రకమున్నది. ఈ రకాని కెప్పుడు పొరిగింటి పుల్లకూర రుచి. ఈ మహానుభావులకు ఇంట్లో చేసినవి బాగుండవు. హోటల్లో చేసినవి ముఖ్యంగా బాగుంటవి. నెలాఖరుకి మాత్రము ఇంట్లోవే బాగుంటాయి. వండలేనమ్మ పెట్ట లేనమ్మకు హోటలు నుంచీ కారియరు తెప్పించుకోటానికిదో మామంచి వీలు.

ప్రపంచములో సృష్టింప బడ్డ జీవుల కన్నిటికి ఆహారము అవస రము- మానవుడు తప్ప మిగిలిన జీవులన్నీ మితముగానే అవసర

మున్నంత వరకే తినును. అందుకనే వాటికి డాక్టర్లతో, ఔషధము లతో వైద్యశాలలతో నిమిత్తములేదు. మానవుడొక్కడే అవివేకియై. ఆశతో పుట్టింది తినటానికోసమేనన్నట్లు రేపటికి కూడా ఈవేళ తిని కష్టపడతాడు. ఏమైన మానవునికి ఇంత చెడ్డ దూర దృష్టి వుండటము మంచిది కాదు. రుచులు జిహ్వా తన ఆధీనములో వుంచుకో గలిగిన నాడు యోగి అది సాధించగలిగిననాడు ఏమైనా సాధించగలుగు తాడు. అది సాధించలేని వాడు ఏదీ సాధించలేడు. అటువంటి వాళ్లు మాట్లాడే మాటలు వట్టి ప్రగల్భాలే, కాబట్టి ఏదైనా సాధించేముందే, సాధించుతాము అనే ముందూ ఆహారనియమములు పాటించగలమా లేదాని పరీక్ష చేసుకుంటే చాలు—ఫలము ఎట్లా వుంటుందో తెలుస్తుంది.

అయినా మనిషై పుట్టి పశు పక్షాదుల కన్నా అవివేకంగా ప్రవర్తిస్తే దాని అర్థమేమి తిరుమలేశ? అసలు ఆ మాటకొస్తే అన్ని విధాల మనము పశు పక్ష్యాదుల కన్నా అన్ని విధాల హీనమైన జీవ నము గడుపుతూనే చాలా తెలివిగల వాళ్ళమని విర్రవీగుచున్నాము. మానవుడు బైట ప్రకృతినంతా జయించితే మాత్రము ఏమి లాభము. తమ స్వంత దేహాన్ని జయించలేనిది?

క్షేత్ర క్షేత్రజ్ఞ మీమాంసల సారాంశము ఇంతే నంటాడు వేదాంతి. తిరగ వెయ్యండి మీ భగవద్గీత—



# చక్షు—విచ....!

కొంతమందికి కళ్ళు వుండీ కనబడవు- మరి కొంతమందికి మెదడుండీ పనిచేయరు. కళ్ళు తెరచుకుని చూస్తూనే వుంటారు కాని ఎదురు దెబ్బలు తింటుంటారు. పప్పులో కాలు వేస్తుంటారు. అడుసు త్రొక్కుతు వుంటారు. కాళ్ళు కడుక్కుంటూ వుంటారు. అరటి తొక్కమీద బాటా బూడ్సుకాలు వేసి విరగపడి పళ్ళువూడగొట్టు కొని మూలబడతారు. వీరికి కనబడకపోవ టానికి కారణాలు చూపు మాంద్యము కావచ్చు లేక ఆహార వికారముచే కండ్లు నెత్తిమీదకు వెళ్ళి వుండవచ్చు, అదీగాకపోతే దిక్కులుజూచి నడిచే అలవాటు వుండవచ్చు, మెదడుకూడా అంతే, ఎక్కడో వూహా ప్రపంచములో విహరిస్తూ వుండవచ్చు లేదా అమెరికన్ పత్రికలలో చదివిన హంత కుల టాక్‌టిక్సు, లేక ట్రూలవ్‌లోని కామజాడ్యపు విపరీతపు చిహ్నాలో, లేక రూపాయి నవలలోని పత్రిక పరిశోధనా గ్రేసరుని చాతుర్యమో అవగాహన చేసుకుంటూ వాస్తవ జీవనములోని పరిస్థి తులన్నీ మరువవచ్చు.

పూర్వము ఒకావిడ రాజుగారిని జూచి వచ్చి మొగుడ్ని మొట్టిందట. అసలు ఆమె జూచి వచ్చింది నిజమైన రాజుకూడాకాదు- నాటకాల్లో రాజునే చూచివచ్చింది. ఆమాట కొస్తే ఇప్పుడు మనము

సినిమాలు చూచివచ్చిచేసేది మాత్రమేమిటి? అలాఅంటున్నానని సినిమాల వాళ్ళంటే నాకేమైనా విరోధమను కొనేరు. సినిమాల వాళ్ళంటే నాకుచెడ్డ అభిమానము సుమండీ. సినిమాలంటే సరేసరి; మహా యిష్టము- ఎటొచ్చి ప్రవాస ఆంధ్రులందరివలె మంచి మంచి సినిమాలు రిలీజు కాగానే వినే భాగ్యములేదు. ముందు రేడియోలో పాటలు విని, తరువాత గ్రామఫోనులో విని ఆతరువాత సినిమా వింటూ చూడొచ్చు- సినిమాలు చూచివచ్చి పెడనచీర. వెంకటగిరి రవిక అవతలపారేసి మాలపిల్ల చీర, ఝునక్ ఝునక్ రవిక తొడిగి తిమా- ఆవారా పర్టు వేస్తిమా. సినిమాలో చూచినట్లు తల సింగారిస్తిమ. ఇల్లు అలంకరించితిమ, మిత్రులతో విహరిస్తుంటిమ, కష్టపడి హిరోయిన్ నడిచినట్లు నడవటము హిరో నవ్వినట్లు నవ్వటము వారు చేయి త్రిప్పినట్లు త్రిప్పటము. పొగత్రాగినట్లు త్రాగటము మొదలైనవిలాసమైన పనులన్నీ నేర్చుకొంటిమా. రాజును చూచి వచ్చి నావిడలాగు మొగుడ్ని మొట్ట లేదంటే దాని గొప్ప తనము ఆబిడకుచెల్లదు. నాటకాల్లోవలె రాజును చూస్తే మొట్టే వారేమోగాని అదృష్టవశాత్తు సినిమాల్లో రాజులుండటము లేదుగా? వాస్తవిక జీవితములో వుండే మొద్దబ్బాయిలు, అగ్గిరాముళ్లు, బుగ్గి రాముళ్లు, పెద్దమనుషులు. పక్కింటి వాళ్ళు, పొరుగింటివాళ్లు, చుట్టాలు వుండటమువల్ల ఆలాంటివిపత్తు సంభవించకుండా వుండి పోయింది. కాబట్టి సినిమాలలో నిత్యసత్య జీవితమును యథాతథ ముగా చూపించుటచే ఈ విపత్తులులేకుండ చేసినందుకు వారు శ్లాఘ నీయులు, అంతేకాదు- సినిమాలవల్ల సంఘము చాలా విధాల బాగు పడుచున్నది. ఈమధ్య ఒక సినిమాలో విద్యావతి విద్యా విహీనుడైన భర్తకు ఆటలు నేర్పించిన చిత్రము చూచి ఒక కోనసీమ అమ్మాయి

తన విచారము మరచి తన భర్తను కాళిదాసుని చేసి వేసింది! ఒక రాయలసీమ అబ్బాయి రోజులు మారిన వని గుర్తించి రామదాసయ్యాడట. ఇంకో అమ్మాయి మంచి మనస్సుతో బాధ పడుతూ ముందు మంచిరోజు లున్నవనేతృప్తితో ప్రశాంత జీవితము గడుపుచున్నది. ఇంకా కొందరమ్మాయిలు తల్లి ప్రేమ తీపిదనము. సోదరిప్రేమ సొంపు. కపట మనుష్యుల కంపు సినిమాలలో ప్రత్యక్షంగా జూచి, వాటిని జీవితములో కనబడే మనుష్యులకు అన్వయించుకొని జీవితబాటలు సరిదిద్దుకున్నారు.

ఇదంతా వేళాకోళము కాదుసుమండీ. అసలైన సిసలైన నిజము. నిజంగా చిత్రాలు సంఘానికి అమోఘమైన సేవ చేయగలవు. సాహిత్యముకన్నా సంఘసేవా సంస్థలకన్నా. వుపన్యాసములకన్నా ప్రభుత్వ చట్టములకన్నా, బహుళ ప్రచారముగల వగుటచే చిత్రములు అవలీలగా అశేష ప్రజానీకానికి ఏ సందేశాన్నయినా అందివ్వగలవు. అందుకనే మనమందరము చిత్రాలు ఉత్తమోత్తమైన చిత్రాలు తయారు చేసి భారతదేశము ప్రగతి దిద్దే అవకాశము చిత్ర నిర్మాతలచేతులలో ఉన్నది.

కాని మంచి ఉన్నచోట చెడ్డ వుండక తప్పదు- వెలుతురున్నచోట చీకటుంటుంది. అట్లాగే ఈ చిత్రాల వల్ల సంఘానికి ఎంతో కీడు కూడా వాళ్లు చేయగలరు- ఇప్పటికే సంఘానికి చాలా కీడు సంభవించింది. ఇంట్లోనుంచి ఎట్లా తప్పించుకు వెళ్లాలో, ప్రియులనెట్లా రహస్యంగా కలుసుకోవాలో. ఎట్లా వాళ్ళను నవ్వించి వలలో వేసుకోవాలో ఎట్లా వాళ్ళని ఇష్టంలేనప్పుడు పళ్ళు ఊడగొట్టాలో భార్యమ భర్త ఎట్లా మోసము చెయ్యాలో, భర్తను భార్య ఎట్లా

వశీకరణము చేసుకోవాలో నేర్చుకున్నారు. ఆఖరుకు మూలకూర్చునే ముసలమ్మ కూడా సుతారంగా మాట్లాడి అతిథులకు కాఫీ ఇచ్చి (ఇదివరకెరుగని) కాఫీ తాను త్రాగడము నేర్చుకున్నది. ఇదివరకు సరిగా బడికిపోయే అబ్బాయి బడి ఎగ్గొట్టి అబద్ధాలు ఎలా చెప్పాలో నేర్చుకున్నాడు. కాని ఇవన్ని సినిమాలలో చూపించకుండా ఎట్లా వుంటారు. ప్రదర్శించక తప్పదు. కాబట్టి నేర్చుకొనినవి వుపయోగించ కుండా వుండే విచక్షణాజ్ఞానము ప్రేక్షకులకు కలగివుండాలి, రాజును చూచివచ్చి గడుసరి భర్తను రోసి రాజుగా చెయ్యాలి గాని మొట్టితే ప్రమాదముకాదుటండీ. సెరిబ్రెల్ హేమరేజి కలుగకపోయినా దాదాపు అంతఆపత్తు రావచ్చు-

ఎంతో వుపయోగకరమైన చిత్ర పరిశ్రమను అటు చిత్ర నిర్మాతలు ఇటు ప్రేక్షకులు చక్కగా వుపయోగించుకోవాలి. మగ వారి నిలా నమ్మరాదే చెలీ, అన్నప్పుడు తలూపి, నేనే రాణినైతే ఏలనో ఏకధాటిగా 'నన్నప్పుడు గర్వపడుతూ' 'వద్దంటే కావాల' న్నప్పుడు మందహాసము చేస్తూ 'ఎందాక ఎందాక, అంటే హృదయము స్పదింపచేస్తూ, 'టకటక జమకులబండి' ఏరువాక చిన్నన్నా. "ధరణికి గిరి భారమా" అంటే మనస్సు గ్రామసీమల హృద్యంగ దృశ్యాలను అవలోకించాలి. ఆనందించాలి. అయా చిత్రాలు నిగూఢంగా ఇచ్చే సందేశాలు గ్రహించాలి- నీరుపాలు కలయికలో పాలనే గ్రహించే హంసవలే మంచే గ్రహించాలి. అటు చిత్ర నిర్మాతలు వుత్తమ చిత్రాలు తీసి దేశకల్యాణానికి సోపానములు దృఢమైనవి కట్ట ప్రయత్నించాలి. ప్రభుత్వ సెన్సారు కట్టుబాట్లతో అమ్మాయిలు అబ్బాయిలు కంటితోపాటు మెదడుకు పని యివ్వాలి. 

# ఆదరి

ఈ మాట అర్థము కొరకు నిఘంటువులు చూస్తే ప్రయోజన ముండదు. పండితులనడిగితే నిష్ప్రయోజనము. ఆదరన్న పదము నేను ముచ్చటగా ఫెమనిష్టు (Femanist) అన్న పదానికి పెట్టుకున్న ముద్దు పేరు. ఈ పదము నిజంగా Wirelessఅన్న ఆంగ్ల పదానికి వితంత్రి అన్న తెలుగు తర్జుమా అంత సమంజసముగా వుండక పోయినా రమారమీ సరిపోతుందనే వుద్దేశముతో నామకరణము చేశాను.

అసలింత కష్టపడాలన్న అవసరము ఏమొచ్చిందంటారేమో అసలు సంగతులేమిటంటే మొన్న శ్రీ పండిత నెహ్రూగారు అఖిల భారత మహిళా సభా ప్రాంగణములో కీ॥ శే॥ శ్రీమతి సరోజనీ నాయుడు, కజన్సు సతుల పేర భవనమునకు ప్రారంభోత్సవము చేస్తూ మన దేశములోని మహిళా సంస్థలలో పనిచేసే స్త్రీలు అదృష్టవశాత్తు ఆదరులు కారని తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. అప్పుడు ఆయనకు ఆదరులంటే ఇంత భయమెందుకు చెప్మా అనిపించింది. తరువాత వాకబు చేయగా ఈయనకేగాక మన దేశ నాయకులలో చాల మందికి ఆదరులంటే హడలని తెలిసింది. అందు చేత నేనట మన మహిళా

సంస్థలు ఆడరుల చేతులలో లేవని మన నాయకులు సంతోషిస్తూ వుంటారట. (-వాళ్ళ క్లబ్బులో విన్నమాట)

ఆడరిలంటే మండోదరివంటి రాక్షసులనుకునేరు— కాని యించు మించు అంతటివారే. వారు ఒకానొకప్పుడు ఐరోపా దేశములో పురుషులు తమకు చేస్తున్న అన్యాయములు (పురుషులు అక్కడ కూడా అన్యాయము చేసారులెండి. ఎక్కడ చేయరు గనుక ! ) భరించ లేక ఒక్క ఉమ్మడిగా పురుషులమీద దండయాత్ర చేశారట- అప్పటినుంచీ వాళ్ళంటే పురుషులకు మహా చెడ్డ హడలు, ఉత్తర కుమారుళ్లు కొందరు ఘట్టిగా హక్కులకు గురించి మాట్లాడిన ప్రతి స్త్రీని 'ఆడరి' అని అపహాస్యము చేస్తూ నిజంగా తన 'డర్'ను కన బడకుండా (ముఖ్యంగా స్త్రీలకు) దాచుకున్నారట. ఈ ఆడరులు మన దేశములో లేరని అటువంటి వాళ్ళ చేతుల్లో మహిళా సంస్థలు లేవనీ మొన్న నెహ్రూగారు సెలవిచ్చారు- అంతే కాదు భారతస్త్రీల ఓర్పు, త్యాగము, సహనము స్వార్థరహిత జీవిత విధానాన్ని గూడా గొప్పగా పొగడారు- భారతీయులలో కొందరికైనా భారత మహిళ లంటే సదభిప్రాయమున్నదని వారిని గౌరవిస్తున్నారని పర్యవసాన ముగా తేలింది. భారతీయులకందరికీ ఇట్టి అభిప్రాయము లేకపోవ టానికి కారణమేమిటి? భారత మహిళలందరూ అట్టి ఆదరాభిమాన గౌరవములకు పాత్రులు కాకపోవచ్చును.

అంతేనా కారణము. కాదనే చెప్పాలి. ఇందులో ఒక చిదంబర రహస్యమున్నట్లున్నది. భారత మహిళల పవిత్రత భారతీయులకు తెలి యనిదికాదు- కాని వారికి స్త్రీల పవిత్రతను గౌరవించుట ఏమంత సమ్మతమైన పనికాదు- ఇష్టమైన పని అసలేకాదు. కారణము? భయము- ఎక్కడ స్త్రీలకు మర్యాదిస్తే తమకు లోపము వస్తుందో

నని. ఇంత భయముండుటచేత వారుఅకారణంగా భయపడుతూవుంటే వారికి అభయమిచ్చి భయపడకుండా వుండేటట్లు చేసుకోవలసిన భారము మళ్ళీ భారత మహిళలపై బడుచున్నది—

పతియే దైవమని భారత సతి ఆరాధిస్తుంటుండెను. తన సర్వ స్వము అతనికి అంకితము చేయుచుండెను. తన సుఖము, తన శాంతి, తన ధనము తన ఆరోగ్యము, తన నిద్రాహారాలు. తన తన వ్యక్తిత్వము వేయేల తన జీవిత సర్వస్వము పతి పాదాలమీద పడవేయుచున్నదే ; పతికి శుష్క సాష్టాంగ నమస్కారములు చేయకపోవచ్చును- కాని దానికన్న మిన్నగా హృదయారాధన చేయుటలేదా? పతినే ప్రత్యక్ష దైవముగా చూచుకొనుటలేదా; న్యాయంగా మాట్లాడితే నిజంగా భారత స్త్రీ దేవునికన్నా పతినే భక్తితో కొల్చుచున్నది- పరోక్షంగా వున్న దేవుడికి ఒకరోజు పూజ చెయ్యకపోతే కోపము రాదు; అభి షేకము చెయ్యకపోతే శపించదు; కొబ్బరికాయ కొట్టకపోతే తిట్టదు; కర్పూరము వెలిగించకపోతే కొట్టదు- వరము లివ్వకపోవచ్చును- కాని ప్రత్యక్ష దైవములను అనుక్షణము కొలవక తప్పదు. తను సర్వ సుఖాలని త్యాగము చేసి స్వార్థ రహితముగా తమ సమస్తకామి తార్థముల కల్పతరువని ఆరాధిస్తున్న ప్రత్యక్ష దైవము ఇంతటి భక్తురాలై భారత సతీమ తల్లికి వరమివ్వబడేమి?

అదే భారత మహిళ ఖర్మ. ఎంత చేసినా భర్తకు తృప్తిలేదు. చేస్తున్నకొద్ది ఇంకా భార్య అనురాగాలు, భక్తి, సేవ ఆశించుతూనే వుంటాడు- ఒకవేళ భార్యలను మెచ్చి వరమిచ్చిన భర్తలున్నా, "మీ భక్తికి మెచ్చితిమి" అని మాత్రము అనరు- ఏదో జాలి కలిగి ఆ భార్యలకు కనికరముగా చేస్తున్న ప్రసాంశర్హమైన కృత్యము వారిది-

చిన్నపిల్లలకు గారాము నేర్పి కొందరు తల్లులు చెడగొట్టుచున్నట్లే భర్తలకు ఎక్కువ శ్రద్ధాభక్తులతో నిరంకుశలుగా చేస్తున్నారని కొంతమంది వాదము. అది నిజమే కావచ్చు-

ఈ భారత మహిళల ఓర్పుకి. సహనానికి స్వార్థ త్యాగానికి ఇదేనా బహుమానము? దానివల్ల బాగుపడ్డదెవరు? ఇటు స్త్రీలకు నిత్య సేవా కొరగాని జీవనము, అటు పురుషులకు అడ్డులేని యాజమాన్యము.

భారత మహిళలను గొప్పగా పొగడే శ్రీ నెహ్రూ తదితర సోదరులు ఈ పై సమస్యను తీర్చగలరా? ఎట్లా తీర్చగలరు?

భారత మహిళలు సౌమ్యంగానే కనిపెట్టుకొని పరిశీలించగలరు- ఆడరులకు భయములేదు.



## దాంపత్యము - అమెరికను స్త్రీ అభిప్రాయము

"ఆతన్ని నేను గాఢంగా ప్రేమిస్తున్నాను" అనే వనిత మాటలు నమ్మబోకు. రేపు ఆమె "నేను అనుకున్న సుఖము నాకు లభించ లేదని" చెప్పబోతుంది.

ఈ విధంగా ఈ రోజులలో యువతీ యువకుల వివాహములు పరిణామము పొందుటకు కారణము వారు వివాహము ఒక ప్రేమ గాథని భ్రమించటమే. వీరి అన్యోన్యత కామవాంఛ తీరిన తరువాత వుండదు. జీవితములోని సమగ్రమైన కష్టసుఖాలు ఓపికతో తట్టుకొనుటకు శక్తి నివ్వలేదు. ఈ ప్రేమలో సాధారణంగా యువతీ యువకుల కామవాంఛ ఎన్నిపాళ్ళో, నిజమైన అనురాగ మెంతో తెలిసికొనుట చాలా అవసరము.

నిజమైన అనురాగమున్న దాంపత్యములో పరస్పర లోపములు తెలుసుకొని. అర్థము చేసుకొని, ఒకరి నొకరిని పూర్తిగా అవగాహన చేసుకొని జీవితములోని కష్ట సుఖములు ధైర్యముతో ఎదుర్కొంటూ జీవితము తాపీగా సాగించగలరు. వివాహమైన వెనువెంటనే దాంపత్యము ఒక తియ్యని గాథ కాదు. నిత్య జీవిత విధానమని తెలుసుకోవలయును.

వివాహానికి ముందు, వివాహమైన వెంటనే "నేనతన్ని గాఢంగా ప్రేమిస్తున్నాను" అనే వ్యక్తి "నేను అనుకున్నంత సుఖము అనుభవించటము లేదని" చెప్పితే మీరు ఆమెను వెంటనే అడగండి— "అంత సుఖము అనుభవిస్తానని ఎందుకనుకున్నావు? నీకెవరు చెప్పారు అలా అనుభవించగలవని?"

వివాహములు విఫలమైన దాంపత్య జీవితము దుఃఖ భాజన మగుటకు ముఖ్యకారణములు:

1. పురుషులు కాదంటారు. స్త్రీలు నిరసిస్తారు. కాని నిజంగా కారణము ఈ రోజుల్లో స్త్రీ పురుషులు కలసి పని చేసే చోట్ల స్త్రీ పురుషులు తమ భర్తలను భార్యలను మోసగిస్తూ వున్నారు.

2 అత్త వల్ల చాలా దంపతుల జీవితాలు భగ్నమవుచున్నవి.

3. రాజును చూచి మొగుడ్ని మొత్తే మానసిక పరిస్థితి నేటి యువతీ యువకులలో దురదృష్టవశాత్తు కలగటము.

4. స్త్రీల అభివృద్ధి సహించలేక భర్తలు భార్యలను ఈసడించ డము.

5. ప్రేమ పెళ్లిళ్లు సుఖాంతముగా వుండుట అరుదు. పెద్దలు నిశ్చయించి చేసెడి వివాహాలే సుఖాంతముగా పరిణామము పొందే అవకాశాలు ఎక్కువగా వున్నవి, అని చెప్పుతూ అమెరికాలో ఇప్పుడు విడాకుల సంఖ్య తగ్గినదని చెప్పారు శ్రీమతి డాక్టరు. విరా వెవిన్. పూర్వము విడాకులు తీసుకుంటే సిగ్గు, తప్పు అనుకునే రోజుల్లో దంప తులకు వారి దాంపత్యములో సుఖము లభించక పోయినా ఎట్లాగో కష్టపడి వారి జీవితాలు కొనసాగించేవారు. అందుచేత పిల్లలకు ఏమీ

ఇబ్బంది వుండేది కాదు, విడాకుల వల్ల బాధపడేది స్త్రీ పురుషులు కాదు. వారు వెను వెంటనే ఇతరత్రా సుఖము వెతుక్కుంటారు.

ఇబ్బంది పడేది పిల్లలే.

ప్రస్తుతము, చిక్కంతా నేటి యువతీ యువకులు అయోమయా వస్థలో నున్నారు. వారికేమి కావాలో వారికే తెలియదు. అందుచేత ఏదో అసంతృప్తితో బాధపడుతునే వుంటారు. స్థిమితంగా వారుసర్దుకున్న తరువాత బాధలేదు.

త్వరలోనే పశ్చిమ దేశాలు సర్దుకోగలవు. కాని తూర్పు దేశాలు ఈ సాంఘిక గడబిడలకు తయారు కావలసియున్నది. ఇదీ ఆమె చెప్పిన విషయము.

ముందున్నదన్న మాట ముసళ్ళ పండుగ. ఈబిడ మొన్న ఫిబ్రవరి 69 లో జరిగిన అంతర్జాతీయ కుటుంబ నియంత్రణ సమావేశమునకు హాజరయినప్పుడు తెలవిచ్చిన విషయాలు. ఈమె ప్రఖ్యాత డాక్టరే గాక రచయిత కూడాను, "దంపతులతో డాక్టరు ప్రసంగము." "పెండ్లిలో ప్రేమ," "వివాహ సంబంధము," "వివాహ పూర్వము ఆలోచన" మొదలగు గ్రంథములు రచించి యున్నారు. ఈమె సాంఘిక పరిస్థితులు పరిశోధించి వివాహము, దంపతుల పరిస్థితులు సమగ్రముముగా, సక్రమముగా పరిశీలించిన అనుభవజ్ఞులు.

కాబట్టి ఆమె అనుభవముతో యిచ్చిన సలహాలు భారత యువతీ యువకులు సావధానంగా పరిశీలించుకోవలసి యున్నది. యిందు ముఖ్యము— ఊహా ప్రపంచములో గాలి మేడలు కట్టుకుని ఆతరువాత ఆశాభంగము గలిగించుకోకుండా వుండుట తరువాత

తృప్తిని అలవరచుకొనుట. తూర్పు దేశాలలో ముందున్నది మునళ్ళ పండుగ యని ఆమె హెచ్చరించుచున్నారు. పశ్చిమదేశాల వారి అనుభవమును పరిశీలించి వారు పడిన సాంఘిక సాంసారిక బాధలు కలిగించే పరిస్థితుల నుండి వైతొలగుట వివేకము.

అట్టి పరిస్థితులకు ఎంత దూరంగా వుంటే అంత మేలు. 

# ఊదు వత్తులు

అన్నిటిలో వలనే దీనిలోను రకాలు వున్నవి. దేవుడికి నైవేద్యము పెట్టినట్లు ఏదో మ్రొక్కు చెల్లించుకోటానికి రెండు కడ్డీలు వెలిగించితే లాభములేదు. ఒక పావలా శ్రేష్టమైన జవ్వాజీ కడ్డీలు వెలిగించి పెట్టి కూర్చుంటే మెలికలు తిరిగి నీలిమేఘాలలో ఏకమవుతున్న సౌరభదూపముతో పాటు మన ఆలోచనలు సుడులు గుళ్లు తిరిగి అనంత ప్రపంచములో లీనమవుతాయి.

అప్పుడే సంక్రాంతి పండుగ వచ్చి వెళ్లింది. బూరిముక్క తిన్నామోలేదో రైతుల పెద్ద పండుగ అప్పుడే దాటిపోయింది. అనుకున్నాన్నాళ్లు పట్టలేదు. ఏదైనా అంతే. అది వుంటే బాగుండు, ఇది వుంటే బాగుండు, అది వస్తే బాగుండు అని అనిపిస్తుంది. తీరా అది వచ్చేటప్పటికి అనుకున్నంత ఆనందము ఇవ్వదు— కష్టమూ అంతే. అబ్బో అంత బాధ అయితే ఎట్లా, ఇంత కష్టమయితే ఎట్లా అబ్బో నాప్రియమైన— చనిపోతే బ్రతకలేను. ప్రాణ త్యాగము చేసుకుంటాను అనే వ్యక్తి తీరా బాధ, కష్టము వచ్చినప్పుడు అన్నీ భరించి, భరించలేని వియోగమనుకున్నదానిని ఎంతో తాపీగా తట్టుకో గలుగుతారు,

మనకు స్వతంత్రము కావాలి, స్వరాష్ట్రము కావాలి అని గడిబిడచేశాము. స్వతంత్రము వచ్చిన తరువాత. స్వరాష్ట్రము సిద్ధించిన తరువాత ఎన్ని ఘన కార్యాలు చేయాలని కలలు కన్నాము. తీరా స్వతంత్రము, స్వరాష్ట్రము వచ్చిన తరువాత ఏమి చేస్తున్నాము. అందని పండ్లకు ఎగబ్రాకుతున్నామా లేక అందని ద్రాక్ష పండు పులుపంటున్నామా?

"ఏ పూర్వ పుణ్యమో ఏయోగ బలమో
జనియించిననాడ వీస్వర్గ లోకమున"

అన్ని కవిగారి మాటల్లో ఎంత వరకు నిజముంది. ఏ పూర్వ పుణ్యమో. ఏయోగ బలమో వుంటే నేనా ఇక్కడ పుట్టేది. అయితే ఈ ముప్పది కోట్ల జనము ఏదో పూర్వజన్మలో పుణ్యము చేశారన్న మాట, అయినా మన దేశము స్వర్గమనుకోటము ఎంత పొరపాటు, ఇప్పుడే స్వర్గంగా వుంటే ఇంక రాజకీయ వేత్త పనేముంటుంది. నరక కూపంగా వున్న ఈ దేశాన్ని భూతల స్వర్గంగా చేసే అవకాశము వారికి వుంచాలి కదా.

పాపము— అన్ని పాపాలకు భైరవుళ్లు ఈ రాజకీయ వేత్తలు, అయిందానికి, కాని దానికి వాళ్ళను దుయ్యబట్టటము అలవాటై పోయింది. అది మరి వారు చేసుకున్న అపరాధమే. చేసుకున్న వారికి చేసుకున్నంత!

అసలట్లా అంటారేగాని నిజంగా మనము ప్రపంచములో చూచేది మాత్రము అదికాదు. ధర్మ ప్రవర్తనగలవారు. సత్య నియమ పరాయణులు. అనేక కష్టాలు అనుభవిస్తూ వుంటే. పాపాత్ములు, అవనీతి పరాయణులు, నీచులు, మహా సంపదలు సుఖాలు అనుభ

విస్తున్నారు, అయితే వేదాంతములో దానికొక జవాబున్నది. అంతా పూర్వజన్మ ఫలము !

సంపదలు అనుభవించే వారు అదృష్టవంతులను కోవటము పొరపాటు. దేవుడు మనుష్యులను పరీక్షించటానికి ధనము ఒక మహా సాధనము. బైబిలులో కూడా అదే చెప్పినట్లున్నారు— కాని 'ధనం మిదం జగత్' అని ఈ లోకములో అంతా పని ధనంతో వుంది. ధన వంతులను ఆశ్రయించకపోతే ఎట్లా— ధనాఢ్యులందు కడుదైన్యము మానమని భర్తృహరి సెలవిచ్చాడు. కారణము? దేవుడు నెన్నొసట వ్రాసిన సొమ్ము బంగారు పర్వతానికి పోయినా స్మశానానికి పోయినా ఒకటిగానే దొరకుతుందని. అయినా ఈ ధనవంతుల దగ్గిరకు పోరాదు. వారిని ఆశ్రయించుకుని కూర్చున్న వారెవరు? బట్రాజుల వలే పొగడి తమపనులు జరుపుకునే వారేకదా. వీరి దగ్గిర నుంచీ ఎంత దూరముగా వుంటే అంత మేలు.

సరైన మిత్రులను జూచుకొనుట చాల కష్టమైన పని. చెడ్డ వాళ్లు ఎన్నో 'సుధీ గుణంబులను దురితా రూఢము చేయుదురు'— కాని ఇతరులతో ప్రశక్తి లేకుండా ఎట్లా వుండగలము— "లోకోప వాదో బలవానిత సత్యవతీ శ్రుతిః"గదా? బలిష్టమైన లోకోపవాదమునకు సుజనులు భయపడుట సహజము"

"కైక పుట్టి చెఱచెరా రాము పట్టంబు
సీత పుట్టి లంక చెరచె గాదె
కౌరవుల చెరచె గాద ద్రౌపదియు కూడా"

అనే లోకోప వాదములలో ఏమి సత్యమున్నది. అంత ఆలోచించుకోకుండా వరము లిచ్చేసిన దశరథ మహారాజు వివేకియేనా?

కామాంధకారముతో రావణాసురుడు చేసిన పనికి మంచి శాస్తి కాదా? పాపము ద్రౌపదేమి చేసింది. అన్నా దమ్ములు కారాలు మిరియాలు నూరుకొని ఒకరి నొకరు సంహరించుకొని పాపము అప రాధము ఆమె మీదకు త్రోయటమా?

అల సెవడురా అంటే కొంకి వెంకడన్నారట వెనకటికి ఒకరు. అలాగే అన్ని అపరాధములు ఆడువారి మీదవేస్తే సరిపోతుంది. తీరు కగా భర్తృహరయ్య అందుకనే అన్నాడు "తొయ్యలులకన్న రమ్య వస్తువులులేవు, వారలే కష్టములకెల్ల గారణములు" సరిసరి. పాపము శమించుగాక. కష్టములకెల్ల కారణములు పురుషుల వక్రచింతలేయని ఎరుగరా.

ఎప్పుడు కొందరికి ఆలోచనలు వక్రంగానే తిరిగి పోతుంటవి! కారణమేమో. కుక్కతోక తిన్నగాచెయ్యలేక పూర్వము రామలింగ కవికినానా అవస్థలు పడ్డాడుకదా? అట్లాగే వీరి ఆలోచనలు తిన్నగా నడిపించటము మహా కష్టము—పుట్టుకతో బుట్టిన బుద్ధి పుడకతోనే పోవాలి.

కుక్కలు మా వింతజంతులు. మనుష్యులకన్నా ఎంతో విశ్వా సముకలవి. అందుకనే శునకరాజములంటే మనుష్యుల కంతమోజు. వాటిని పెంచి, సోఫాలో కూర్చోబెట్టి. కార్లల్లో త్రిప్పే అదృష్టము కూడా పట్టింది. ఈ శునక రాజములమీద మోజు ఈ మధ్య కొంచెము మరీ విపరీతముగా పెరిగినట్లున్నది. అందుచేతనో ఒక సినిమాలో ఈ జంతువుకు మనుష్యులకన్నా ఎక్కువ ప్రధానపాత్ర ఇచ్చారు. కాని ఎప్పుడైనా ఎవరికైనా ప్రాముఖ్యము పెరిగిందంటే ఏదో ప్రమాదము వున్నాదన్నమాట. పెరుగుట విరుగుట కొరకే. అంతే

కాదు. పెరిగిన వారిని లాగుట చన్నీటి ధర్మము. ధర్మా ధర్మముల పరిశీలన మనకిప్పు డేల?

అయితే మనకిప్పుడు కావలసిం దేముంది? "శరీరమాద్యం ఖలు ధర్మసాధన" శరీరము ధర్మసాధనకే అన్నారు. కాబట్టి ఆ ధర్మ మేదో తెలుసుకొని తరువాత సాధించటానికి ప్రయత్నిద్దాము.

"ఊదువత్తులు కాలిపోయినవి."

ధర్మముసాధించే ప్రయత్నంలో వుంటే ఇంకో పావలా సాంబ్రాణి కడ్డీలు ముందు సంపాదించాలి. ★

## తరువాత ఎవరు?- బంగారు సంకెళ్ళు

తరువాత ఎవరు? ఎంతటి అవివేకపు ప్రశ్న. దేని తరువాత ఎవరు? ఎవరు చూచి వచ్చారు? ఎవరుచూడబోతున్నారు. మన తరువాత ఎవరు ఈ ఆస్తిని వినటానికని విలపించేవారిని చూచి నవ్వాలో ఏడవాలో తెలియదు. రేపటిసంగతి తెలియదు. మరుక్షణము సంగతి తెలియదు. మరుక్షణము మనమేమయేదీ తెలియదు. తరువాత ఎవరి సంగతితో సతమత మవటమెందుకు? మనకున్న జబ్బు అదొక్కటే కాదు. మన ఆస్థికి తరువాత ఎవరనివిలపించి అంతటితో వూరుకుంటే కొంతవరకు బాగానేవుంటుంది. అబ్బెమనమట్లా వూరుకునే జాతికాదే! ఎల్లమ్మకు పిల్లలు లేకపోతే మనకేబాధ. పుల్లమ్మకు పుత్రులు లేక పోతెనూ మనకే బాధ. కొంపతీసి సుబ్బమ్మకు పిల్లలుంటే వాళ్ళ పెళ్ళిళ్లు ఎట్లా, అని వ్యధ. వూళ్ళో సుబ్బమ్మ పిల్లల సంగతే మనకు ఆందోళన కలిగిస్తే మన పిల్లలు, మన అక్క చెల్లెళ్ళ పిల్లలు, అన్న దమ్ముల పిల్లలు ఆడబిడ్డల పిల్లలు సంగతి ఆలోచించకుండా వుండ గలమా? తరువాత ఎవరు, ఏమిటి. అనేది మనకు పెద్ద సమస్య. ఇది ఆలోచించగా ఆలోచించగా వికారమై భూతమై మనకు భయము కలిగిస్తుంది. కారణము ఈ తరువాత, మన తరువాత కోడలెవరో అల్లుళ్ళెవరో, అధికారమెవరిదో ఇదీ వరస ఆలోచనా పరంపరలకి.

అతంటితో ఆగితే అదృష్టమే. నయగరా జలపాతములాగా ఆలోచనలు "ఈ తరువాత"నే శిఖరాగ్రమునుండి అంతు లేకుండా పడుతూనే వుంటవి. ఈ హెడ్‌మాస్టరు తరువాత ఎవరు? ఈ బోర్డు ప్రెసిడెంటు తరువాత ఎవరు? ఈ పార్టీతరువాత ఎవరు? ఈ ముఖ్య మంత్రి తరువాత ఎవరు? ఈ ప్రధానమంత్రి తరువాత ఎవరూ అని ఆలోచనలు తప్పవు. ఆలోచించిన తరువాత అనక తప్పదు. అన్న తరువాత పత్రికలలో ప్రకటించక తప్పదు. ఈ చిత్రంలో చిత్రమేమి టంటే ఈమధ్యే హటాత్తుగా మూక వుమ్మడిగా ఈవ్యాధి కొందరికి తగిలింది. ఈవ్యాధి గ్రస్తులందరూ నెహ్రూ తరువాత ఎవరూ అని అడగటము ఆరంభించారు.

నెహ్రూ తరువాత ఎవరైతేనేమిటి? ఇప్పటినుండీ ఆలోచించ వలసిన పనేముంది. మహామహులంటివారు ఇదివరకు ఎంతమంది పుట్టలేదు! పుట్టినవారు గిట్టక తప్పదు, ఈ ప్రపంచములో ఎవరు లేక పోయినా సాగిపోతుంది. మనకు నెహ్రూ ఎట్లా దొరికాడు? నెహ్రూ తరువాత అట్లాగే దొరకుతాడు పరిస్థితులలో నుంచే నాయకులు పుట్టుకు వస్తారు. నెహ్రూ తరువాత ఎవరూ అనే ఆనే ప్రశ్న పభార తీయునికి నిజంగా ఆందోళన కలిగించదు. పుట్టుకతోనే ప్రతిభార తీయుడు వేదాంతి. అతనికది జన్మహక్కు. ఫలాని పుల్లయ్యానిచెప్పినా నమ్మడు. "చూదాము అప్పటిమాట" అని అంటాడు. అనకపోతే అనుకుంటాడు. ఈ నెహ్రూ తరువాత ఎవరూ అన్న జాడ్యముకూడా మన పుత్తైలో వుట్టినదికాదు, ఎవరో విదేశీయులకో లేక ఏ రాజకీయ వేత్తల పన్నాగమో మన మీదకు వదిలేశారు. గొత్తైల మందలు ఎప్పుడూ సిద్ధముగా వుంటవికదా ఒక గొత్తై ఎటుపరుగెత్తితే మం దంతా అటు పరుగెత్త వలసిందే. తరువాత ఎవరూ అంటే అందరూ

ఎవరూ అనే ప్రశ్నతో వారి వెంట పరిగెత్తుచున్నారు. కొన్ని కొన్ని దేశాల పత్రికలు నెహ్రూ తరువాత "ఫలానా" నని ఇదివరలో ప్రచారము చేశారు. ఈ ప్రచారములో అనేక వుద్దేశ్యములుండ వచ్చు. ప్రజల హృదయాన్ని కనుగొనవలయు ననుకొనవచ్చు, లేక ఇష్టములేని వ్యక్తి కొరకై ప్రచారము చేస్తూ అనుకూల వాతావర రము కలిగింప ప్రయత్నించ వచ్చు. రాజకీయవేత్త ఎప్పుడు ఒకటి తలచి ఇంకొకటి పలికి, మరియొకటి చేస్తాడు, అది ఎంత నేర్పుగా చేస్తే అంత మహానాయకుడు. Diplomate అవుతాడు. ఈ మధ్య ఒకానొక పార్టీనాయకుడు నెహ్రూ తరువాత ఇందిరాగాంధీ ఆస్థాన ము ఆక్రమించగలదని నుడివాడు. ఆయన నిజంగా అలాగే తలంచు చున్నాడో లేదో మనకు తెలియదు. కాని అందరూ అలా నమ్మవల యునని మాత్రము ఆయన అభిప్రాయముకావచ్చు. దానివల్ల సాధక బాధలు మనకు తెలసినంత వరకు ఇప్పుడేమీలేవు.

అందు చేత మేము నెహ్రూ తరువాత స్త్రీల యుగమని గాఢ ము గా నమ్ముచున్నాము. ఒక దేశమునకు అధినేతగుటకు ఒక వ్యక్తికి కొంత శిక్షణ అవసరము. శ్రీమతి ఇందిరాగాంధీకి ఒక రాజకీయ వేత్తమనుమరాలిగా, బిడ్డగా ప్రధాన మంత్రి బిడ్డగా, కాంగ్రెసు అధ్యక్షురాలిగా అట్టి వలయు శిక్షణ లభిస్తూవున్నది. సుశిక్షితురాలైన ఆమెను దేశక్షేమము కొరకు వుపయోగించుట ధర్మమే కాగలదు.

మాకు జ్యోతిష్యము తెలియదు. ఇవి ప్రగాఢవాంఛలు కావు. కాని మా దూరదృష్టిలో మాకు కనపడు వాస్తవిక దృశ్యములు. స్త్రీల చేతులలోనే నవ భారత నిర్మాణము రూపొందగలదు. కాని ఆ బాధ్యతలు పైబడే లోపల మన సోదరీమణులు అత్యధిక ఇతర

బాధ్యతలు సహితము భరించుటకు తయారు కావలసి యున్నది. ఇప్పటి మన పరిస్థితులు పరీక్షించుకుందాము.

జీవితములో ఇంకా కొంచెము దూరము సాగిపోయాము. జీవితము పొడుగు తగ్గింది. కాని మన ఆశయాల ఆదర్శాల దరి చేరామా?

లేదు- చాలా దూరమున్నాము, ఇంకా సంకెళ్ళనుండి వదల్చు కొనలేదు. బంగారు సంకెళ్లు అరిగి విరిగిపోలేదు. అన్నీ అరిగిపోయి నట్లే ఈ బంగారు సంకెళ్లు అరగిపోతవనుకున్నాము. అలా అరిగి పోవాలనే ఆ సంకెళ్లును రకరకాల అరగగొట్ట ప్రయత్నించాము, రాజకీయ అంపము వాడము. సాంఘికపు వులి వుపయోగించాము. కాని లాభములేదు. బంగారు సంకెళ్లు వింతగా ఇంకా బలమై గట్టివై కూర్చున్నవి. అంతేకాదు. అంపమును వాడిన చేతులకు కాయలు కాచినవి. వులి వాడుటచే చేతులు కందిపోయినవి. శ్రమపడి ఫలము దక్కలేదు. చేతులమంట-కడుపుమంట—హృదయవేదనా మిగిలాయి.

కష్టే ఫలిన్నారు పెద్దలు. పడ్డ కష్టానికి ఎప్పుడో ఒకప్పుడు ఫలము దక్కకపోదు. ఇన్నాళ్లు ఈ బంగారు సంకెళ్లు మెరుపు చూచి ఆనందించాము. అందచందాలు చూచి భ్రమించి నిర్భయముగా చీకూ చింతా లేకుండా సంచరించాము, కాని ఇప్పటికీ సంకెళ్ళు సంకెళ్ళేనని బాగా తెలుసుకున్నాము. సంకెళ్ళు బంగారపువైనా ఇనపవైనా మనకు వరిగేది ఏమీలేదని బంగారు సంకెళ్లు నవరత్న ఖచితమైనా సంకెళ్ళ బాధ తప్పదని తెలుసుకున్నాము. వీటినుండి మోక్షమెప్పుడు? ఎట్లా?

మహిళోద్యమము ఇంకా తీవ్రముగా సాగాలి. మహిళాభ్యు దయముతో పాటు పురుషులలో పరివర్తనము కలిగించాలి. కొంత

వరకూ ఈనాడు ఆశయాలు సఫలీకృతమైనట్లే. సంపూర్ణ ఫలితము సాధించాలంటే ఇంకా ఒకటి రెండు తరములు జరిగిపోవాలేమో.

ఇప్పటికి మహిళోద్యమములో శ్రీమతి ఇందిరాగాంధీ ఒకానొక ప్రముఖ అధికార రాజకీయ పక్ష సాధన్యము వహించుటతో **మహిళా యుగమునకు** నాంది పలికినదేమోనని ఆశ కలుగుచున్నది. ఇదివరలో అట్టి స్థానము స్త్రీలు వహించారు. దానిలో క్రొత్తేమీ లేదు. కాని అప్పటి పరిస్థితులు వేరు. ఇప్పటి వాతావరణము వేరు. నెహ్రూ తరవాత ఎవరూ అనే సమస్యకు జవాబు మాకు తెలియదు. మేము జ్యోతిష్యులము కాదు. కాని నెహ్రూ తరువాత భారత సారధి ఒక స్త్రీ కాగలదని మేము విశ్వసించుచున్నాము. ఇది సోది కాదు. కాని ఇది మా నిర్భయ విశ్వాసము. ప్రస్తుత భారత, రాజకీయ, సాంఘిక ఆర్థిక పరిస్థితులు చక్కబెట్టుటకు స్త్రీ సారధ్యము అవసరమని మాకు స్పష్టముగా గోచరించుచున్నది. అనేక క్షేత్రములలో సోదరీమణులు తమ సామర్థ్యమును ప్రదర్శించియే వున్నారు. వారు సర్వాధికారములు వహించి, దేశ సారధ్యము వహించి నవ భారత నిర్మాణములు చేయవలసిన సమయము తప్పక రాగలదు. కావున ఆ బాధ్యతలు వహించుటకు ఇప్పటినుండియే సోదరీమణులు సంసిద్ధులై ఆ కార్య నిర్వాహణకు తగు తర్ఫీదు పొందుచున్నారు. బంగారు సంకెళ్ళనుండి భారత మహిళలకు విముక్తి సాధించటము ఈ కార్యక్రమములోని ప్రధమ కర్తవ్యములు కాగలదు. ఈసారి రంపములు పులులకు బదులు లోకముతో పాటు రసాయనక పదార్థములతో ఈ సువర్ణ శృంఖలముల నుండి విముక్తి బొందవలసియున్నది.

## తియ్యని బాధ - జీవన్మరణములు-

అమ్మో, అబ్బో, దేవుడో నాకు వద్దురో దేవుడా — ఒక్క క్షణము కెవ్వుమని కేక- మందహాసము మరోక్షణము.

ఆడపిల్లయితే....

అత్తగారేమంటారో అన్న భయం, భర్త ఏమనుకుంటాడో అన్న సందేహము, కష్టపడ్డందుకు సరైన ఫలము దొరకలేదనే విచారము—

మొగపిల్లవాడైతే....

ముఖము చాటంత, కళ్ళలో ఆనందము నృత్యము చేస్తూవుంటే, పెదాలమీద మందహాసము పీస్తూవుంటే హృదయములో సంతోష సాగరము వుబికి ప్రవహిస్తూవుంటుంది. ఒక్క క్షణమునకు ముందు పడ్డ బాధంతా మరచిపోతుంది మాతృమూర్తి. ఆ బాధపడే క్షణములలో ఎంత భక్తి, ఎంత వైరాగ్యము కలిగింది. అంత పరిపూర్ణముగా అంత హృదయపూర్వకముగా ఇదివరలో దేవుడిని నమ్మలేదు. ఏదో పూజలు ప్రతి దినమూ చేస్తున్నా దేవుడు వచ్చి రక్షించుతాడని పూజలు చెయ్యటములేదు. అదొక అలవాటుగా చేసేది, కాని ఆ క్షణములో ఆస్పత్రిలో ప్రసూతి వార్డులో "పుష్పం ఫలం సమర్పయామి" లేకుండానే గాఢంగా దేవునియందు భక్తి కుదిరి ఆపద్భాంధవుడు

తనని వచ్చి రక్షించుతాడని నమ్మి "రావే ఈశ్వరా! కావవే" యని పిలిచింది. బాధ తగ్గలేదు. ఆ కరుణామయుడు పలుకలేదు. అలవై కుంఠపురి నుండి రానూలేదు. అందుచేత వెంటనే ఎమ్. ఎల్. ఎ. (M. L. A.) లవలే పద్ధతి మార్చివేసి వద్దురా బాబు అని వైరాగ్యములో మునిగిపోయింది. అంతేకాదు బైట వరండాలో ముచ్చమటలు పోసి తోచకుండా పచారు చేస్తున్న అయ్యగారికి సైతము విద్యుశ్చక్తి ప్రవహించినట్లు తన వివిధ మానసిక పరిస్థితులను, అనుభూతులను కలుగజేసింది. భక్తి, వైరాగ్యము ఆనందము- ఈ కలగా పులగమే తియ్యనిబాధ-

అట్లాగే వృద్ధ తండ్రి లేక అప్తుడు మరణించినప్పుడు వుంటుంది. శరీరము చల్లబడుతూ, నాడి అందకుండాపోతూ వున్నప్పుడు, డాక్టరు పెదవి విరచినప్పుడు మనప్రాణము వలలో చిక్కిన పావురము వలే కొట్టుకుంటుంది. మనప్రాణమే పోయేటట్లు వుంటుంది. కొండంత తండ్రి లేకుండా జీవించటము అసంభవ మనిపిస్తుంది. తండ్రిలేని తల్లిని ఎట్లా ఓదార్చ గలనని దిగులు గలుగుతుంది. తండ్రి లేకుండా తాను అనాథనై పోతున్నానని దుఃఖము పొర్లి పొర్లి వచ్చి ముంచేస్తుంది. పెద్దలు తండ్రిని తీసి క్రిందపెట్టి నప్పటినుండి శ్మశాన వాటికలో శరీరము పంచ భూతములలో కలసిపోయే వరకు దుఃఖము అతిశయించి వైరాగ్యములోకి పూర్తిగా ముంచుతుంది. ఎంతటి ఘనుడైనా, ఎంతటి వానికైనా మరణము తప్పదు, జీవించేమి, బ్రతికేమి. చావవలసిన వాళ్ళమే కదా- తొందరగా అందరము చస్తే పీడా వదలిపోతుందని తోస్తుంది. దాన్నే శ్మశాన వైరాగ్యమంటారు, కర్మచేసి పీలు నామా చూచి ఇంటికి పెద్దయి జీవితము సాగింపవలసి వచ్చినప్పుడు తండ్రికన్నా తానెంత చాతుర్యముతో

వ్యవహారములు నడుపగలననీ గర్విస్తాడు. వృద్ధుడైన తండ్రి మరణము వలన నష్టమేమీలేదని సమాధానపడతాడు. అభివృద్ధిపొంది అది చూచుటకు తండ్రి లేడేయని కించెత్తు విచారపడ్డా, స్వర్గాన్నుంచి చూచి 'సంతోషించ గలడని' ఆనందిచుతాడు. అదీ జీవిత విధాన సరళి; భయము, దుఃఖము ఆనందము, ఇది చక్రము లాగా తిరుగుతూ వుంటుంది. భయము దుఃఖము ఆనందము, భయము దుఃఖము ఆనందము. కాబట్టి ఆనందము తరువాత భయము: దుఃఖానికి ముందు మెట్టు— అదీ తియ్యని బాధ— అట్లాగే ఆనందానికి ముందుమెట్టు (ప్రసూతి విషయములో) తియ్యని బాధ. ప్రసూతి వైరాగ్యము, స్మశాన వైరాగ్యము హాస్యాస్పదమైనవి. తియ్యని బాధలో మనము మన నిజ స్థితిని మరచే అవకాశమున్నది. నిజస్థితి మరచి ఏవో అభిప్రాయాలు ఏర్పరుచుకొని క్షణంలో మళ్లీ వాటిని మార్చుకుంటే హాస్యాస్పదులు కామా?

సుదీర్ఘంగా ఆలోచిస్తే జీవితము అంతా తియ్యని బాధయని తోచకమానదు. ప్రస్తుతము భారతీయుల కందరికీ ఈ తియ్యనిబాధ తప్పదు. నవభారత నిర్మాణము ఒక సుదీర్ఘమైన తియ్యనిబాధ. ముందు దేశము సశ్యశ్యామల మవుతున్నదనేఆశ; అనారోగ్యము, ఈతి బాధలు నిర్మూలమై ఆరోగ్యము, అభివృద్ధి నిర్మిస్తున్నామనే తృప్తి. భూతల స్వర్గము చేయగలమనే నమ్మకము, ఇప్పుడు పడుతున్న అప్పులబాధ. అన్యాయము, అనారోగ్యము, తిండికరువు, నీటికరువు. విద్యావైద్య లోటుపాట్లు, తియ్యనిబాధగా మారుస్తుంది. క్రొత్త సంవత్సరమురోజు వేపపువ్వు తింటాము. అది తియ్య తియ్యగా పుల్ల పుల్లగా చేదుగా, వగరుగా ఎంతోబాగుంటుంది. పండుగకు చేసుకున్న బొబ్బట్లు పరమాన్నమంత బాగుండక పోవచ్చును, వుదయమే పండు

గనాడు వేపపువ్వు తిన్నప్పుడు ఇల్లు అలుకంగానే పండుగైందా, ఇంకా అదిచెయ్యాలి. ఇదిచెయ్యాలి అని జ్ఞాపకము వస్తుంది. అట్లాగే విద్యా సౌకర్యాలు సరిగా అమరనప్పుడు ఇంకా నవభారత నిర్మాణ ములో మిగిలిపోయిన ముఖ్య విషయములు స్ఫురణకు వచ్చును. ఆహారసమస్య. జనాభా సమస్య, భూసంస్కరణల సమస్య వగైరా సమస్యలన్నీ పరిష్కారము చేసుకునేప్పటికి బాధ తీయనౌతుంది. ఆ తియ్యని బాధ చప్పరించి "హా! ఎంత తియ్యగా వుంది" అని అనుకు నేప్పటికి మళ్ళీ ఏదో వగరుగా నాలుకకు తగులు తుంది. ఏవో చిక్కులు. కష్టాలు. బాధలు, మళ్ళీ ఆరంభము. వీటిని పరిష్కరించు కునే సమస్యలో పడిపోతాము. అదే జీవితము, నిరంతర సమస్యాపరి ష్కారము—తదనంతర ఆశాభావము— ఆనందము దుఃఖము— లైటు హౌసు అనుసరించి జీవితయాత్ర ప్రయాణము సాగిపోతుంది. జగ న్నాటకుడు సృష్టించిన పిక్‌నిక్ స్థలము ఈ లోకము. మనమంతా పిక్‌నిక్ చేస్తున్న వాళ్ళమే. మనము ఇతరులకు కష్టము లేకుండా, ఇబ్బంది లేకుండా, సువిశాలమైన సృష్టిలో తియ్యని బాధలు అనుభ విస్తూ ఈ పిక్‌నిక్ వీలైనంత హాయిగా, సక్రమముగా జరుపుకో గలముకదా.



# క్రమశిక్షణ- శిక్షణా క్రమము

క్రమ శిక్షణ, శిక్షణ క్రమము లేని జీవితాలు తెరచాప చుక్కాని లేని పడవ ప్రయాణము వంటిది కొందరి మానవులకు క్రమ శిక్షణంటే వళ్లుమంట- శిక్షణ క్రమమంటే తలనొప్పి. కారణము వారు క్రమ శిక్షణ జీవితము చేయలేరు. చేయజాలరు. ఏ నిమిష ములో ఏమి తలుపువస్తే అది చేసిపారేయ్యాలిసిందే- తినాల అని తోచితే వెంటనే ఇంట్లో ఏమిదొరికితే అది తినెయ్యాలి దొరక్క పోతే దొరికే చోటుకువెళ్ళి తినెయ్యాలి. ఎక్కడికైనా వెళ్ళాలి అని తోచితే వెంటనే వెళ్ళాలిసిందే. ఎదురుగా నల్లపిల్లి, వంటరి బ్రాహ్మ ణుడు వరసగా వచ్చినా సాగిపోవలసిందే. ఏదైనా చెప్పవలసి వుంటే అడగవలసి వుంటే ఆ సమయము మంచిదా కాదాని గాని ఆ విష యము అడగవచ్చునాలేదా యనిగాని ఆలోచన చేయటను వారికి అలవాటులేదు. ఎంతవారినైనా, ఎంత మాటైనా అడగగలరు, ఏ విషయమైనా ఎప్పుడైనా చెప్పగలరు. ముందూ వెనుకలు చూడ కుండా ఎడాపెడా ఏదో అంటారు, అందులో కొందరి మనస్సులు నొప్పించగలరు. కాని వారికి ఇతరుల మనస్సులు నొప్పిస్తున్నామని కూడా పాపము తెలియదు. కారణము వారికి ఆ నొప్పించటమంటే ఏమిటో తెలియదు. వారి మనస్సులకు నొప్పిలేదు. ఇతరులను ఏమైనా

అంటారు కాబట్టి వారిని ఏమన్నా వారికి బాధలేదు. ఒక్కొక్కరికి అసలు మనస్సులంటూ లేవేమోననిపిస్తుంది. లేక వారికి గజచర్మము లుండునో? మనస్సంటూ వుంటే అవి ఏ కారణము చేతనో బండబారి పోయి వుండి వుంటాయి.

ఈజాతి "హాస్యదిఃక్రియతే కర్మరుద్భిరనుభూయతే" అంటే నవ్వుచూ, చేయుచూ ఏడుస్తూ అనుభవిస్తారు. అంటే ఈ నవ్వుతూ చేసేవాళ్ళు సైతము వాళ్ళ శరీరాన్ని ఎంతమందముగా చేసుకున్నా వాళ్ళ మనస్సులను ఎంత బండపరచుకున్నా ఏడవక తప్పదని పెద్ద లన్నారు. పెద్దలన్న మాటలలో ఎంతో కొంత సత్యము లేకపోలేదు. గుఱ్ఱాన్ని కొరడాతో కొట్టవచ్చును. ఏనుగుమీద చరకాకోలు పని చేయదు. ఆ ఏనుగును వశపరచుకొనుటకు అంకుశము కావాలి. అట్లాగే ఒక శిక్షణలో వున్న మనిషికి ఒక కనుసన్నచాలు. మరి కొం దరికి ఒకమాటచాలు మరికొందరికి అప్పుడప్పుడు ఒకచిన్న వుపన్యా సముతో దారిలోకి వస్తారు, మరికొందరున్నారే, వారి చర్మాలు ఏనుగ చర్మానికన్నా మందము. వారి మనసులు కరకు రంపములు. వాళ్ళ బుద్ది కొండరాళ్ళు. హృదయము తోలుతిత్తులు. ఇవేవీ సరిగా పనిచేయవు. పరీక్షించి, పరిశీలించి ఆలోచిస్తే వారిలో స్వార్ధము నిలువంతా వుంటుంది, ఆ స్వార్ధమేవారిని అవివేకులగాను, బుద్ధిహీను లగానూ, చతుష్పాద జీవులగాను మార్చేస్తుంది.

వీరికి ఇంత స్వార్థము ఎట్లా వచ్చింది; పుట్టుకతో కొంత వరా షరా అయి వుంటుంది. కుటుంబములోని పరిస్థితుల వల్ల, వారి పరి సర ప్రాంతముల వల్ల ఆ స్వార్ధము పెరగవచ్చును. తల్లి తండ్రులు వుపాధ్యాయులు వారికి క్రమశిక్షణ నేర్పని కారణముచే వారితో

ఒక శిక్షణాక్రమను లేమిచే ఈస్వార్థము పేరు కొనిపోయి అసహజ పశుప్రాయులగు జీవులుగా తయారవుతారు.

వీరు వారి కుటుంబమునకు, సంఘమునకు, దేశమునకు తీరని నష్టము కలుగచేయుదురు. దురదృష్టవశాత్తు వీరి హస్తాలకు అధికారము, విద్య. ధనము, కైవసమైతే వీరు ఈ లోకములోనే మరి యొక్క నరకము సృష్టిస్తారు- ఇలా ఇతరులను బాధపెట్టి వారేమీ సుఖపడరు. తాత్కాలికముగా సుఖపడుతున్నామని అవివేకముతో సంతోషించ వచ్చును. ఎప్పుడో మిన్ను విరిగి పడును. చేసిన పాపము పండి పగలి వారిని క్రుళ్ళించును. దానితో వారు నిస్సహాయులై, క్రూరులై, అఘాయిత్యములు చేయుదురు. ఈ అఘాయిత్యములు ఒక్కొక్కప్పుడు జారచోరములు కావచ్చును. ఒకప్పుడు హత్య ఆత్మ హత్యలు కావచ్చును, దేశములో హత్యలు గాని, ఆత్మ హత్యలు గాని పెరిగిపోవుచున్న వంటే దానికి కారణము దేశములో స్వార్థము పెరిగిపోతున్నదన్నమాట, దేశములో దుర్మార్గము(Crime) పెరిగదంటే స్వార్థము పెరుగుతున్న దన్నమాట. దుర్మార్గపు దుస్సఘటనలు ఎక్కువ అయితే దానికి పోలీసు బందోబస్తు ఎక్కువ చేసి, పోలీసు కోర్టులు ఎక్కువ చేస్తే లాభము లేదు. ఈ స్వార్థాన్ని నిర్మూలించటానికి ప్రయత్నము చెయ్యాలి.

స్వార్థాన్ని ఎట్లా నిర్మూలించగలము. అసలు నిర్మూలించ గలమా? మొక్క మానయిన తరువాత త్రుంచలేము—గ్రొడ్డలి, రంపము అవసరము- అట్లాగే మనుష్యులను చిన్నతనములో క్రమ శిక్షణిచ్చి బాగుపరచగలము- శిక్షణ వలన జీవితములో క్రమ పద్ధతి అవలంభించగలము. చిన్ననాట- తలితండ్రులు, గురువులు చేయవలసిన పని అందు ముఖ్యముగా తల్లి బాధ్యత ఎక్కువ. ఆమెయే వుగ్గు

పాలతో క్రమ శిక్షణ నేర్పవలయును. తనకే లేనిచో ఆమె బిడ్డలకు నేర్పజాలదు. కావున భావి పౌరులు సుపుత్రులుగా, సుజనులుగా సౌసీల్యవంతులుగా తల్లితండ్రులకు, కుటుంబమునకు, దేశమునకు, పరువుప్రతిష్టలు సంపాదించే వారిగా తయారు చేయాలంటే మహిళలు గృహములను శిక్షణ కేంద్రములగా గుర్తించి బిడ్డలకు చక్కని శిక్షణ ఇవ్వవలయును. తనకు అట్టి శిక్షణ ఏకారణము వల్లనైనా తన తలితండ్రు లివ్వనిచో, భావి సంతతి, దేశయోగ క్షేమముల కొరకైనను తమ జీవితములు ఒక శిక్షణ క్రమములో వుంచి బిడ్డలకు క్రమ శిక్షణివ్వవలయును.

ప్రపంచ చరిత్ర అవలోకిస్తే దుర్మార్గులు, భయంకర నియంతృత్వము, మారణ యుద్ధములన్నీ ఇట్టి క్రమ శిక్షణలేని స్వార్థపరుల సృష్టియేనని తేటతెల్ల మగును. కావున ప్రపంచములో శాంతి కావాలంటే జీవితాలు సుఖమయంగా వుండాలంటే క్రమశిక్షణ అందరికీ చాలా అవసరము. 

# వేదము—సారము

వేదములు నాలుగట. అవి వేదభాషలో రచింప బడినవట. ఆ భాష సంస్కృతమునకు దగ్గిర చుట్టమట. పై రెండు భాషలురాని వారు ఇంగ్లీషులో చదివి తెలుగులో అర్థము చేసుకోవచ్చును. ఈ మధ్య తెలుగులోనే చదివి, ఆంగ్లములో అర్థము చేసుకునే అవకాశ ములు ఏర్పడినవట.

అసలింత కష్టపడి వేదములు చదువవలసిన ఆవసరము ఏమి వచ్చిందని అడగవచ్చును. అది చాలా సబబైనప్రశ్న. అసలు ఆమాట కొస్తే ఏ పుస్తకమైనా ఎందుకు చదవాలి? డిగ్రీ కోసము. పరీక్షల కోసము చదవటము వేరేసంగతి. కాని వూరికేనే వుండలేక, పుస్త కాలు కొని చదవటము దేనికి? వూరికినేదొరికిన పుస్తకమైతే వుబుసు పోకకు చదువుకోవచ్చును. కాని పుస్తకము కొని చదవటము చాలా అవివేకముగా కనబడుతుంది. తప్పని సరిగా కొనవలసిన వెన్నోవుంటే డబ్బు, కరువురోజులలో పుస్తకాలు కొనటమేమిటి? పుస్తకాలకు పెట్టింది పువ్వులకు పెట్టింది డబ్బు వట్టి దండుగే.

అయినా ఎరుగని పుస్తకాల్లో ఏముందో చూద్దామని కుతూ హలము ఒక్కొక్కసారి వ్యసనమువలె మనలను పట్టుకుంటుంది. అప్పుడే చదువకూడని పుస్తకాలు విద్యార్థులు క్లాసు పుస్తకాలక్రింద

పెట్టి చదువుతారు. అక్షరజ్ఞానములేని రాజకీయ వేత్తలు తాజా వార్తలనిచ్చే పత్రికలోని సంగతులు బట్టీపడ్తారు. నవయవ్వనులు ప్రబంధాలలోని కాముకుల సంభాషణలు కష్టపడి నేర్చుకుంటారు. సాహిత్య పిపాసకలవారు అర్థముకాని పుస్తకాలు చదువుతారు మనమందరము తరచూ ఋగ్వేదము సామవేదము సంగతి వింటూ వుంటాము. అథర్వణవేదము సంగతి అంతగా ఎప్పుడూ వినము. మొన్నీ మధ్య అనుకోకుండా అధర్వణ వేదములోని చిత్ర విచిత్ర విశేషములు వినే అవకాశము కలిగింది. ఆ విషయాలు వినగానే నా మానసిక ప్రపంచములో భారతదేశానికి ఒక ఉత్కృష్ట స్థాన మిచ్చాను. భారత నాగరికతకు అధర్వణ వేదమునకు అగ్రస్థానమిచ్చి హృదయ నీరాంజనమిచ్చి. నేను ఆంధ్రుడుగా భారతీయుడుగా జనించినందుకు నన్ను నేను అభినందించుకున్నాను. ఆనందము ఎక్కువైనప్పుడు మనలను మనము అభినందించుకోటముతో వూరుకోబుద్ధి కాదు. ఇతరులను కూడా అభినందించాలని బుద్ధి పుట్టుతుంది. ఇప్పుడు మేము మీ గొప్పలుచెప్పి మిమ్ముల అభినందించ దలచాము.

శాస్త్రములు చదువకయే, పరిశోధనలు చేయకయే భారతీయులు అన్ని శాస్త్రముల సారములు గ్రోలిరి- ఎట్లు? ఆనోట ఆ నోట అందించిన అనుభవమే మనకివ్వని బిరుదులు, భారతములలో అగ్రతాంబూలము అందుకొన వలిసినవారు ఆంధ్రుడు ప్రతి ఆంధ్రుడు అభివందనీయుడు. ఆంధ్రుడవై పుట్టుటలోనే ఒక విశేషమున్నది. ధర్మశాస్త్ర పురాణములు హృదయముగా గలది తెలుగట. అందుకనే ధర్మశాస్త్ర పురాణములను ఆంధ్రదేశమున అంత విరివిగా చదువు చుందురు. వకల్తాలేని వకీలు పట్టబద్రులు, అలయా వరణములోనే గాక అరుగులమీద పురాణ కాలక్షేప కార్యక్రమములు సాగించు

పండితోత్తములు అందుకనే ఆంధ్రదేశమున కోకొల్లలు. మెట్టవేదాంతము అందుకనే విరివిగా అచ్చట తయారవుచున్నది. అయితే మన చుట్టు ప్రక్కనున్న వారి సంగతేమిటని మీకు సందేహము రావచ్చును. అథర్వణవేద అన్వయ ప్రకారము— తర్కవ్యాకణములు హృదయముగా గలది తమిళమట. అందుచేతనే అక్కడ లక్షలు సంపాదించే వకీళ్లు పుట్టారు. జ్యోతిష భైషజ్యములు హృదయము గాగలది మళయాళము కషాయాలు తైలాలు అక్కడ ఎందుకు తయారవునో మీకు విశదము. మీమాంసాన్యాయములు, హృదయముగాగలది మహారాష్ట్రము. అందుచేతనే బొంబాయి మహారాష్ట్ర విభజన సమస్య మీమాంసగనే మిగిలిపోయింది. ఛన్దస్సు నిరుకము హృదయముగాగలది. వుత్కళమట. శిక్షా కల్పములు హృదయము గాగలది కర్నాటకమట. వేదమునే పరిభాషగా వుపనిషర్ధమున వ్యవహరించునది నిద్వ్యము. ఉద్గాత్ర లక్షణమున వ్యవహరించునది సింహాళ భాష. వీరందరూ అధర్వానికి చెందిన వారట. అంటే ఈ అధర్వణ దేశమున నున్న ఈ ఆరు భాషలున్నూ ఆరు శాస్త్రముల అన్తరార్ధమును ప్రకటించునట. అవి ఆరు అధర్వానికి చెందినవట. అందున ఈషట్ శాస్త్రముల హృదయమైన ప్రాంతీయ భాషలు గల వారు అధర్వీయులు వీరు ఆత్మార్ధ పరులట.

అంటే ఇంతకీ తేలిన విషయము. మనము అధర్వీయులము. ఆత్మార్ధ పరులము.

ఈ అధర్వవేదము కూలంకషముగా చదువవలసిన అగత్యమున్నట్లు తోచుచున్నది. ఈ వేదములోని విషయాలు మోక్షానికి దారి చూపేవికావట. ఇహమేగాని పరము ప్రసక్తి లేదట, అవపూర్తిగా మన నిత్య వ్యవహారిక జీవితములో సహాయపడు విధి

యములను గురించి తెలుపునట. దానిని ఆంగ్లములో **Materialistic** వేద మంటారు. ఆవేదమున సేటిలైట్సు ఎట్లా పంపాలి, అణ్వా స్త్రములు ఎలా తయారుచేయాలి, విమానములు ఎట్లా నిర్మాణము చెయ్యగలము, ఆహార సమస్య ఎలాపరిష్కారము చెయ్యాలి, తెలియ పరచి వున్నవట- రెండవ ప్రపంచ సంగ్రామమున హిట్లరు మహా శయుడు ఈ అధర్వణవేదమునందలి విషయాలు పరిశోధింపచేసి దాని ప్రకారమే అణ్వాస్త్రములు తయారు చేయించాడని కొందరి నమ్మ కము. అయితే హిరోషిమా ఆపదకు మనము, మన అధర్వణవేదమే కారణమన్న మాట! రామ రామ. పాపము శమించుగాక. ఈ పాపానికంతా మనమేనా బాధ్యులము?

ఈ వేదములో ఇలాంటి ప్రమాదకరమైన విషయాలుండబట్టే గాబోలు మన పెద్దలు ఈ వేదమునకంత ప్రాముఖ్యతనివ్వలేదు. కాని కీడులో మేలున్నది. ఈ ప్రమాదకరమైన అధర్వణ వేదములో కొంత లాభకరమైన విషయాలుకూడా వున్నవి. ఈ అణ్వాశాస్త్రాలకి తిరుగుడు ఆయుధము కూడా తెలిపేవున్నారట. ఇంకో హిట్లరంటి వ్యక్తి పరిశోధన జరిపితేగాని అది బైట పడగలదు. అంతేకాదు అదృ శ్యంగా విమానములో వెళ్లు విధము. అదృశ్యంగా విమానము వెళ్లు చున్నప్పుడు కనుగొనే విధము. గ్రహాలు, ఉపగ్రహాలు సృష్టించే విధము కూడా వున్నవట. విషయములన్నీ సాంగోపాంగముగా పరిశో ధించితే, దేశ రక్షణకు ఉపయోగపడగలవు. ఇతర దేశములతో పాటు సరిసమానమైన స్థానములో నిల్వవచ్చును. మన గొప్పలు చెప్పుకుంటున్నామంటారు. కొందరు పెద్దలు- విమానాలు చెయ్య టము మీకు తెలుసయ్యా అంటే ఇదివరలో కొందరు నవ్వారు. ఈమధ్య మైసూరు ప్రభుత్వానికి దొరికిన భరద్వాజుని **Aero Nautics**

గ్రంథము మన ప్రతిభను ఋజువుపరిచింది. అంతేగాక అదృశ్య విమానములు చేయుట కూడా మన భారతీయులెరుగుదురని తెలసి ఎట్లా మనము మనలను అభినందించుకోకుండా వుండగలము? !

అధర్వణ వేదములో వర్షము సృష్టించే విధము కూడా తెలిపి యున్నదట. ఆ విధానము ప్రకారము పరిశోధనలు జరిగినవట. వర్షము కురిపించిరట.

వీటన్నిటికన్నా ముఖ్యమైన మరియొక విషయమున్నదట అది ఆహార సమస్య పరిష్కార విధము. ఆరు రోజులలో వరి, గోధుమలు పండించవచ్చునట. ఈ విషయమున కొందరు పరిశోధనలు చేయుచున్నారు. వారు కృతకృత్యులవాలనే మనము కోరుకొందుము. ఆరు రోజులలో పంట పండితే మన ఆహార సమస్య తీరినట్లే. అప్పుడు జపాను వరిసాగు, చైనా వరిసాగు మన వరి సాగుకు బలాదూర్ కాగలదు.

ఆహార సమస్య తీరిపోతే మానవులకు ముఖ్యమైన మరి రెండు సమస్యలు మిగిలిపోతవి. అది వస్త్రము. ఇల్లు. మానవులకు కావలసినది ముఖ్యముగా తిండి, బట్ట, యిల్లు కదా. బట్టలు బొంగులలో నుంచీ ఇంకా ఏదో ఏదో పదార్థాలతో ఇప్పుడు శాస్త్రవేత్తలు తయారు చేస్తున్నారు కదా? ఇప్పుడు మనకు దూది, పట్టు లేకుండానే నైలాను మొదలగు వస్త్రములు తయారు చేస్తున్నారు-అయితే యిళ్ళు సులువుగా కట్టుకునే విధము తెలియాలి. ఆపైన డబ్బుకూడా వుంటే బాగుంటుందికదా? బంగారము చేసే విధము ఏమైనా వ్రాశారేమో. ఈ గృహ, కనక వుత్పత్తి విధానములు తెలుసుకొనుటకొరకైనా అధర్వణవేదముచదివితే బాగుంటుందేమో. అధర్వణ వేదము చదువుతారా? కష్టే ఫలి. 

## బ్రతికి బాగుంటే....

"నమస్కారము"

"నమస్కారాలు"

"బహుకాల దర్శనము"

"మరచిపోలేదుకదా? ఎప్పుడు వచ్చారు?"

"మరచిపోతే ఎందుకు వస్తాము. రెండునెలలైంది"

"రెండు నెలలా? ఇంట్లో అందరు కులాసానా?"

"మరి ఆబిడను తీసుకురాలేదేమి?"

"నాలుగైదు నెలలనుండీ ఆరోగ్యము సరిగాలేదు. ప్రదేశ మార్పు కోసమే ఇక్కడకు తీసుకు వచ్చాను."

"ఆసంగతి తెలియలేదే తెలిస్తే వచ్చి చూచేదానిని"

"చూడకూడదనే తెలుపలేదు"

"ఆ! చూడకూడదనే తెలుపలేదా?! ఏమి ప్రమాదకరముగా వుండినదా?"

ప్రాణాపాయ కరమేమిలేదు. కాని మానసికముగా ప్రమాద పరిస్థితిలో యుండుటచేత ఆమెను ఏకాంతముగానే వుంచతగిన శ్రద్ధ తీసుకొను చున్నాను."

"ఓహో! అదా! అర్థమయింది. మీరు ఆమె విషయములో చాలా శ్రద్ధ తీసుకున్నారు. చాలామంది నిర్లక్ష్యముగా వుంటారు."

"అది నిర్లక్ష్యముకాదు. మీరట్లా అపోహపడతారు. చాలా మంది మగవారికది తెలియదు. ఈ ఘట్టములో ప్రతిభర్త ఏదోకొంత క్లిష్టపరిస్థితితులను ఎదుర్కొనవలసివస్తుంది. అది భార్య శారీరక మానసిక సంభవమైన మార్పువల్ల కలుగుచున్నదని తెలియదు. ఆమె చేష్టలు అర్థము చేసుకొనలేక, ఏమోనని భ్రమించి. అతిశయ గర్వో ద్రేకములతో పోట్లాడే భర్తలు కూడా వున్నారు. ఈ ఘట్టములోని పరిస్థితులు ఎదుర్కొనటానికి నేను విశేషశ్రమచేసి ఐదారు ఏండ్లనాడే ఆవిషయమును సాంగోపాంగముగా తెలుసుకొనుటకు అనేక పుస్తకములు చదివి ఆ పరిస్థితి వచ్చినప్పుడు ఎదుర్కొనుటకు సంసిద్ధుడనై వుంటిని."

"అలాగా అందరికీ తెలియదంటే నేను వప్పుకోను. తెలిసే, తెలియనట్లు నటించుతారంతే. అయితే మీరు శారీరక మానసిక శాస్త్ర పుస్తకములు ఆమూలాగ్రముగా చదివితిరా?"

"అవును విదేశరచయితలు వ్రాసిన మానసిక శాస్త్రముల పుస్తకములు చదివి దానిలోని విషయములు మనశాస్త్ర పురాణము లలోని వాటికి అన్వయించు కొంటిమి.

"మీరీ విధముగా చదువుటకు కారణమేమిటి? భర్తలందరూ చదువుతారా?"

"జాగ్రత్తగలవారెల్ల చదువుదురు. మీరిదివరలో ఈ విషయ మున కొన్ని వ్యాసములు చక్కగా వ్రాసియుంటిరి కదా? కారణ

మేమిటని అడుగనేల. పురుషులకు ఏ కొద్దిమందికో తప్ప నిజంగానే ఈ విషయము తెలియనే తెలియదు."

"అయితే తెలిసిన మీవంటివారు వారికి తెలుపవలసినబాధ్యత వున్నది. ఒక వ్యాసము వ్రాయకూడదా?"

"మీ పత్రికలో వేసుకుంటే అట్లాగే వ్రాస్తాను."

"మీ వ్యాసమువేసుకునే పత్రికలులేవనే మీరు వ్రాయలేదా?"

"మా పత్రిక మహిళల పత్రిక. దానిని పురుషులు ఎక్కువగా చదవరు. కాబట్టి మగవారు చదివే బహు ప్రచారముగల పత్రికలలో వేయండి."

"అది స్త్రీల కన్వయించే మహిళల పత్రికలో మీరే వ్రాయ వచ్చునుకదా?"

ఓటమి ప్రదర్శించితే సమస్య పరిష్కారమగును. కొన్ని నెల లకుముందు జరిగిన సంఘటన. ఆరోజు ఆవిషయమును గురించి తీవ్ర ముగా ఆలోచించటము తరువాత మరచిపోవటము జరిగినది. కాని మొన్న వార్తా పత్రికలోని ఒక ప్రకటనచూస్తే ఈ విషయము హఠా త్తుగా జ్ఞాపకమొచ్చింది. ఆంధ్రరాష్ట్రములో 1958 వ సంవత్సరములో 2300 స్త్రీ పురుషులు ఆత్మహత్యలు చేసుకున్నారని ఒక ఆంధ్ర సచి వోత్తముడు తెలవిచ్చాడు. ఒక్క సంవత్సరములో 2300 ల ఆత్మ హత్యలా? ఒక్క ఆంధ్రదేశములోనే యింతా? లేక అన్ని ప్రాంతము లలో అట్లాగేవున్నాదా? ఆంధ్రలో ఏమి ప్రత్యేకతలేదు. అంతటా పరిస్థితులంతేయని ఊహించవచ్చు. అంటే పదునాలుగు రాష్ట్రాల్లో సగటునసాలుకు ముప్పది ముప్పదైదువేలమంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారన్నమాట !

ఆంధ్ర మంత్రివర్యులు ఈ విషయంలో ప్రస్తావిస్తూ ఈ ఆత్మ హత్యలకు ముఖ్యకారణములు ఆకలి. దారిద్ర్యము, స్త్రీ పురుషులలో ఈర్ష్య. దుఃఖభాజనమైన వివాహములు, నయము కానిజబ్బులు కారణమని చెప్పారు. రెండవ పంచవర్ష ప్రణాళికలు ముగుస్తున్నవి. ఎన్నో ప్రాజెక్టులు తయారైనవి. కొన్నివేల ఎకరాలు కొత్తగా వరి సాగుకు తయారుగా వున్న సమయములో ఆకలిచావులో ! లెక్క ప్రకారము సాలుకు 2300 లంటే రోజుకు ఆరుచావులా? సామవాద సంఘములో (Socialistic Pattern of Society) ఇలాంటిపరిస్థితులా?

రోజుకి చనిపోయే ఈ ఆరుమందిలో షుమారు ఇద్దరు మగ వారు ముగ్గురు స్త్రీలు, ఒక బాలికో బాలుడో వుందురు – ఆహార సమస్యా పరిష్కారము, పరిశ్రమల విస్తరణతో ఆకలి దారిద్రపు చావులుండకూడదు- పన్నులు ఎక్కువచేసి, భూ సంస్కరణములవల్ల అంతయినా లాభముండవద్దూ. భాగ్య భోగ్య సంపదలలో నోలలాడకపోయినా దేశములో దారిద్ర్యము రూపుమాపాలికదా? ఈర్ష్య ఇదేనా నశించుతుంది. వెర్రి వెర్రి కోరికలు పెట్టుకోకపోతే ఈర్ష్యకు తావేది? సంతృప్తే దీనికిఆయుధము. నైతిక పునరుద్ధరణ అవసరము విషాదకరమైన వివాహాలు ఎలా సంభవించుచున్నవి? ఇవి పిచ్చి పిచ్చి అధునాతన వూహాలవల్ల సృజింపబడుచున్నవి. తామేదో నవనాగరికులమని వెర్రి వెర్రి పోకడలు పోయి వలలో చిక్కుకుని బయటపడలేక వురేసుకోవటము తటస్థ పడుతుంది. అంతేకాదు. ప్రపంచములో అదేమి చిత్రమో, సాధువులైన భర్తలకు గడుసు భార్యలు, సౌజన్యవతులైన భార్యలకు దుర్మార్గులగు భర్తలు. అందగత్తెకు అనాకారి సంప్రాప్త మయినప్పుడు విచారము తప్పదు. కాని వివాహ పవిత్రతను గౌరవించుతూ వున్నంతవరకూ ప్రమాదములేదు. గృహములో

తగాదాలు, సంఘములోని సమస్యలు అవే క్రిందా మీదాపడి పరిష్కారము కాగలవు. మనకట్టు బాట్లకు బద్ధులై, మన ఆచార వ్యవహారము లుపేక్షింపక, వివాహ పవిత్రతను తోసివేయక సహనముతో నున్న వారికి ఆపదలన్నీ కారుమేఘముల వలే విడిపోగలవు. ఈరచన ఆదిలోని సంభాషణా సారాంశము అదియే. విదేశములలో మానసిక శాస్త్రమునకు అత్యధిక గౌరవమునిచ్చి ఆ శాస్త్రము మానవులును. సుఖమును రక్షించుకొనుటకు జయప్రదముగా వుపయోగించు కొనుచుండగా, మనము ఇటు మానసిక శాస్త్రముపై ఆధారపడి యున్న మన ఆచార వ్యవహారములను సాంప్రదాయాలను త్రోసివేసి అటు మానసిక శాస్త్రముయొక్క అభయహస్తమునూ గ్రహించక వుభయ భ్రష్టులమగు చున్నాము. వివాహచ్ఛేదన ఆసంతృప్తి, అనేక వ్యసనములకు లోనగుట ఆత్మనిగ్రహము లేకుండుట ఆత్మహత్యలకు దారితీయును.

నయముగాని రోగపీడితులు ఆత్మహత్య చేసుకొనుటలో ఆశ్చర్యమేమీ లేదు. అటువంటి వారికి ఆత్మహత్య మేలేమో. కొన్ని దేశములలో వారు చనిపోవుటకు వైద్యులే ఔషధ మివ్వవలయునను అభిప్రాయమున్నది. నయము కాని రోగమని వైద్యులు రూఢిపరచిన వేరే నంగతి. బాగుపడే వారికి. నయమయే అవకాశమున్నదని తెలియక పోవచ్చును— ముందు ముందు తగు వైద్య సహాకారముతో, నూత్న పరిశోధనానుభవముతో ఇప్పుడు నయము కావని అనుకున్న జబ్బులు అనేకము నయము కావచ్చును. వారికి సహనము అవసరము— సంఘసేవకులు ఇది సామాన్య జీవితములో ఎదుర్కొనవలసిన సమస్యలలో ఒకటి. పిల్ల విద్యార్థులు పరీక్షలలో కృతార్థులు గాక ఆత్మహత్యలు, పరీక్షా ఫలితములు ప్రకటించినప్పుడు,

ఎక్కువగా జరగటము మనము చూస్తూ వున్నాము. పరీక్షా ఫలితములకింత ప్రాధాన్యమివ్వటము అవసరము. ఇది బాలబాలికలేగాక తలిదండ్రులు తెలిసుకొనవలసిన విషయము. పరీక్షలకు ప్రాధాన్యమివ్వవలయును గాని, పరీక్షా ఫలితములకు అనవసర ప్రాముఖ్యమేల?

ఆదిలో మా సంభాషణలో పాల్గొన్న వ్యక్తి ఓ రాజకీయవేత్త. సాహిత్యవేత్తాను. ఋణము తీరుకలేకుండా వుండే వ్యక్తి అంతశ్రద్ధగా తనకు రానున్న క్షోభను ఎదుర్కొనుటకు, అర్థము చేసుకొనుటకు సన్నిద్ధుడైన విధము శ్లాఘనీయము, సాధారణముగా స్త్రీకి నలుబది సంవత్సరముల వయస్సులో శారీరకముగా కొంత మార్పు కలుగుతుంది. అప్పుడు శారీరకంగా కలిగే మార్పుకన్నా మానసికంగా ఎక్కువ మార్పు కలుగుతుంది, అప్పుడు భర్త తనూ. తన శిశుణలో బిడ్డలూ ఆమెతో సున్నితంగా సంచరించ వలయును, లేదో అవివేకముతో, అహంకార అతిశయ గర్వములతో ఆమెను సరిగా గ్రహించలేనిచో సంభవించే విపత్తుకు భర్తే పూర్తిగా బాధ్యుడు కాగలడు— అప్పుడు కుటుంబములో చెలరేగిన అశాంతికి, జరిగే అత్మహత్యలకు హంతకుడతడే. అది తనకు పరీక్షా సమయము. తనెంత మేధావైనా ప్రపంచ నాయకుడైనా ఈ అగ్ని పరీక్షలో కృతార్థుడు కానిచో ఇటు ఇహము అటు పరముసున్నే.

ఈ సమయమందు గృహములో అశాంతికి కలహములకు కారణము భార్యేనని అపరాధము మోపుట అవివేకము. జ్వరము వచ్చిన రోగిని జ్వరమెందుకు తెప్పించుకున్నావని నిందుంచు చందముగా నుండును. అది స్త్రీ జీవితములో తప్పని ఘట్టము. అందుచేత సంసార జీవితలో ప్రతి సంసారీ అనుభవించవలసిన కష్టము. అది భార్యాభర్త లిరువురికి, సంతానము అనుభవించ వలసిన విచార

ఘట్టము, భార్యకు కలిగిన శారీరక మానసిక మార్పులు దెచ్చుకొను టకు అవకాశము కావలెను, జీవితములో ఇక్కడ నాల్గు రోడ్డుల కూడలి. అక్కడ సరైన మార్గము జూపు చెక్కలుండును- ఒకప్పుడు ఆచెక్కలు మీద అక్షరములు గుర్తు తెలియకుండా మాసిపోయివుండ వచ్చును. ఒకప్పుడు చెక్కలు విరిగిపోయి వుండవచ్చును, సరైన మార్గమేదో తెలుసుకొని సాగిపోవుటెంతో ముఖ్యము. తప్పు త్రోవను దూరమువెళ్ళిన వెను తిరుగుటకు వీలుండదు. అనతి దూరములోనే తప్పు గ్రహించి వెనుతిరిగి ప్రయాణము సాగించుటకు అవకాశముందవచ్చును, కావున ప్రప్రధములోనే సరైన మార్గము చూచుకొనుట చాలా అవసరము.

స్త్రీకి కలిగే శారీరక మానసిక మార్పులు భర్తలో ఒక దశా బ్దము తరువాత గాని కలుగక పోవచ్చును. కావున భర్త భార్యకు మార్పులు కలిగిన సమయములోనే తనలో మార్పుకు సంసిద్ధుడు కావలసియుండును, ఆంగ్లములో ఒక సామెత యున్నది. నలుబదేండ్ల తరువాత పురుషుడు మూఢుడుగానో ప్రతిభాశాలిగనో తయార వును ఈ పరీక్షలో కృతార్థుడైతే ప్రతిభాశాలియే లేనిచో అధో గతియే.

ఇదియే పెద్దలు మనకు వాన ప్రస్థమునకు నిర్ణయించిన సమయము. సన్యాసమునకు ఇంకా తడవున్నది. ఈ క్లిష్ట పరిస్థితులకు మన ఆచార వ్యవహారములు చక్కని పరిష్కార విధానములు- మన సాంప్రాదాయములకు కట్టుబాట్లకు బద్ధులైన వారికి ఎట్టి ప్రమా దమూ వుండబోదు. కొంత వరకూ ఇబ్బందిగా వున్నా చివరకు సుఖాంతమే, తప్పదు.

అత్మహత్య చేసికొనుటే మంత సులువైన పనిగాదు.
దాని వెనుక భారతమంత కథ ఇమిడి యుండును,
ఆత్మహత్య చేసుకున్నవారిని పిరికి పందలని నిందించ జాలము,
దారి దప్పిన వ్యక్తులని కనికరించ తప్పదు.
కాని బ్రతికి బాగుంటే—

సమాప్తం

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 2 | శంఖావినోదము | శంఖానినాదము |
| 2 | 13 | విశేషంబులుమాకుచెల్లదు | విశేషంబులునుగ్గడింప మాకుచెల్లదు |
| 3 | 1 | జాగ్రదావస్తే | నిద్రావవస్థయే |
| 3 | 4 | దేశముబాష | దేశపుబాష |
| 6 | 22 | విన్నట్టులేదు | వున్నట్లులేదు |
| 8 | 7 | చచ్చివచ్చిన | యిచ్చివచ్చిన |
| 9 | 9 | అంగాయి | అందాలు |
| 13 | 9 | ఆరంభించంక | అరంభించక |
| 24 | 14 | మరిది | మరది |
| 35 | 12 | పోటిలోనైన | పోటీలోనైనా |
| 52 | 5 | చెపిలో | చెవిలో |
| 52 | 11 | తాంబూరాలు | తాంబూలాలు |
| 54 | 2 | తలకు | తనకు |
| 56 | 8 | సీడమని | పీడమని |
| 57 | 6 | కుంటుతూనేనా | కుంటుతూనైనా |
| 59 | 4 | కారము | కారణము |
| 59 | 5 | వాంచింతము | వాంఛించుతాము |
| 60 | 4 | దొంపల | దొంగల |
| 66 | 22 | పదిరోజులనుండి | పదిరోజులనుండి |
| 71 | 9 | చేళ్ళు | బేళ్ళు |
| 74 | 19 | ఉండేందని | వుంటుందని |
| 77 | 21 | రహాప్యము | రహస్యము |
| 86 | 9 | కేలుగు | తెలుగు |
| 86 | 16 | నీలకొకసారి | నెలకొకసారి |
| 92 | 16 | మిధ్యములన్నాడు | మద్యములన్నారు |

| | | | |
|---|---|---|---|
| 94 | 7 | వరము లేదు | పరము లేదు |
| 100 | 21 | జీపులు | జీవులు |
| 103 | 24 | ఆటలు | పాఠాలు |
| 108 | 18 | వరమివ్వబడేమి | వరమివ్వడేమి |
| 129 | 5 | తలుపువస్తే | తలుపుపవస్తే |
| 132 | 7 | పచ్చిందని | వచ్చిందని |
| 136 | 14 | ముఖమైన | ముఖ్యమైన |
| 142 | 2 | అవసరము | అనవసరము |
| 142 | 23 | జీవితలో | జీవితములో |
| 144 | 4 | వ్యకులని | వ్యక్తులను |



# అభిప్రాయములు

మొగలిపొట్లము—

మంజుల పరిమళము సునిసిత హాస్యము గల రచనలగా, పానుగంటి, భమిడి పాటి రచనలు స్ఫురించునవి గాను ప్రఖ్యాత ఆంగ్ల కవులు గార్డినరు. చెస్టరుటన్, తేకరే రచనలను బోలినవి గాను వర్ణింప బడినవి.

తెలుగులో కథానికలు రచిస్తున్న రచయితలు పెక్కు మంది కలరు. కాని 'కథా వ్యాసములు' వంటి రచనలు తెలుగులో చాలా అరుదు. ఈ శాఖలో శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారు చేస్తున్న కృషి హర్షించ తగినది. మొగలిపొట్లము పరిమళాన్ని అనుభవించి ఆనందించాలి.

—కిన్నెర

మొగలిపొట్లము విద్యా పరిమళముతో నిండియున్నది. ఆంధ్ర నారీ మణులకు ప్రియమైన కావ్య పుష్పము.

—శ్రీ కో. వెంకట రంగయ్యగారు

మొగలిపొట్టపు రేకుల మంజుల పరిమళము హృదయ దేశము నావరించి హాయి నొసగినది. ఇందలి పదిహేను శీర్షికల చదువ చదువ జవులూరించును. దాని యందు ధ్వనించు భావ గ్రహణశీలు రల్పసంఖ్యాకులనుకొందును. ఆశీర్షిక క్రింద విషయములు భోదించు సత్యమును గ్రహించి జీవితము దిద్దుకొని యిహపరముల గౌరవానంద సుఖము లనుభవింప జాలు వ్యక్తులు ధన్యులు. ఈధ్వని కావ్యము తమ కన్వయించి చూచుకొను వారు జీవిత పథమును గొంతకు కొంతయేని చక్కచేసి కొనగలరేమో యని నా యాస.

—సుధీమిత్ర ఉభయ భాషా ప్రవీణ
జంపాల వేంకటనృసింహముగారు

చక్కని శీర్షికలు యిందు పొందుపరచబడ్డాయి. జీవితంలోని లోతు పాతులను సూచిస్తూ సున్నితమైన హాస్య ధోరణిలో రచన సాగిన ఈ వ్యాసాలు మొగలిరేకుల వలనే మధుర పరిమళం వెదజల్లుతున్నాయి.

—ఆంధ్ర ప్రభ

ప్రస్తుత సామాజిక జీవనంలోని బాగోగులను కళ్ళకు కట్టినట్లుగాను, వ్యంగ్యంగాను విమర్శిస్తుంది. ఈ మొగలి పొట్లము, తద్విమర్శ నిర్భయంగా చేయపడి వున్నది. యిది యీ పుస్తకంలో కనబడే మొదటి విశేషము. దైనందిన జీవితంలో పడి సతమతమైపోయే అల్ప జీవులూ ఎన్నెన్నో కోరికలతో అలమటించే రాజకీయ వాదులూ ఆశవాదులూ వేదాంతులు మొదలైన రకరకాల వ్యక్తులు మనకీ వ్యాసాలలో ప్రత్యక్షమవుతారు. వారి మనఃప్రవృత్తులను చిత్రించి రచయిత్రి తమ విశేషానుభవమున కొక విశిష్ట రూపము కల్పించారని చెప్పవచ్చు.......సంఘంలో కనబడే వివిధ వ్యక్తుల దృక్పథాలను ప్రతిబించే దర్పణమే మొగలిపొట్లము.

—సౌభాగ్య

భుక్తాయాసము, తలకుమించిన తికమకలు, నేటి హరిశ్చంద్రులకు విశ్వామిత్రులేరి అనే హాస్య చిత్రకాల సంపుటిది. దైనందినానుభవ అనుభూతిలోని సన్నివేశాలనాధారంగా ఆవేదనలకు వెలార్పుడానికి చేసిన క్రొత్త ప్రయత్నమిది....

—ఆంధ్రపత్రిక

మనలో మన మాట:-

విజ్ఞాన ప్రదములై హాస్యపూరితములై యున్న రచనలు స్త్రీ లోకమునకే గాక పెక్కెండ్రు పురుషులకుగూడ పఠింపదగినవైయున్నవని నుడువుటకానందదాయకముగా నున్నది. మరియు నివి భమిడిపాటి, పానుగంటి వారి హాస్య రచనల వలె నుండి ప్రత్యేకతను గలిగి సొంపుగానున్నవి. ఈ మెరచనలలోని ప్రౌఢత్వమిందును వెలార్చుచున్నది.

—కొత్త భావయ్య చౌదరిగారు

కాస్త చురుకుపాలెక్కువనిపించినా మంచి ఘాటైన వ్యంగ్యం చాలా వానిలో కనిపిస్తుంది. స్త్రీలు, వారి సమస్యలు, వారి సమస్యల్లో కల్లా జటిల సమస్యలైన భర్తలూ వగైరా వగైరాలు పైరచయిత్రి వైయుక్తికమైన దృష్టితో తన భావాలను నిశ్శంకంగా వెలువరించింది. ఏదో ఆషామాషీగా వ్రాసినవీ అలాగే చదువుకోవలసినవీ అన్న దృష్టితోనే చూడవలసినవి గనుక ఈ వ్యాసాలలో, ఆలా హాయిగా ఒకమారు చదువుకొని ఏ మహిళ అయినా కమ్మని నవ్వు నవ్వి నెమ్మదిగా కలల్లోకి వెళ్ళిపోగల వీలున్నది. యింతకంటే యిందులో వుండవలసినదేమిటి?

—ఆంధ్రప్రభ

హాస్యప్రధానములైన ఈ రచనలు మహిళకే కాక మగవారికైతము ఆనందము సమకూర్చగలవని నా నమ్మకము ... మొత్తానికి గ్రంథమందలి ప్రసంగాలన్నీ రసవంతముగాను, ఉద్బోధకముగాను, చక్కని మాటలతో రచితములైనవని చెప్పక తప్పదు. ఇవి స్త్రీలకున్ను పురుషులకున్ను వినోదకరములగాను, నీతిదాయకములగాను ఉండగలవని నా అభిప్రాయము. ఈ గ్రంథము రచించిన శ్రీమతి లక్ష్మీ రఘురామ్‌గారు తెలుగువారి కృతజ్ఞతకు పాత్రమైనవారు.

—డాక్టరు. గిడుగు. వెంకట సీతాపతిగారు

ఇందలి ఒక్కొక్క రచనా స్త్రీజాతికంతటికి ఎంతో ఉద్బోధకంగా ఆత్మ విమర్శనకు మార్గదర్శకంగా కర్తవ్యాలకు కనువిప్పుగా వుంది. విషయ గ్రహణమునకూ విమర్శకే కాక విజ్ఞానానికి, వినోదానికి, కూడ సహాయపడగ[illegible]వుండడము యిందలి హాస్య రచనలలోని మరొక విశేషము.

—ఆలిండియా రేడియో.

(హాస్యానకు పూర్వము వ్రాసిన వారి సంపుటములపై అభిప్రాయములు.)

